సిద్ధపరచుటలో నిట్టి పుస్తకములు కొంతవర కుపయోగించును. ఈ యుద్దేశముతో నేనీ చిన్ని పుస్తకమును వ్రాసినాను. ఇందు వర్ణింపబడిన యంశము లించుక కష్టమైనవనుట నిజమేకాని వానిని వీలయినంత సులభముగ చిత్రించుటకు యత్నించితిని. ఈ పుస్తకమున నెల్లరకును సులభగ్రాహ్యముగు భాషయే వాడబడినది. నేను కావించిన యీ యల్ప ప్రయత్నమును పాఠకులు తగు విధముగ మన్నింతురని విశ్వసించుచున్నాను.

వరంగల్,
20-11-1951

ఖండవల్లి బాలేందుశేఖరం

# విషయ సూచిక

# 1. నూతన ప్రపంచమును కనుగొనుట

ప్రపంచమునందైదు ఖండములు కలవను నంశమును నేటి బాలబాలికలు కూడ నెరుగుదురు. కాని పదునేనవ శతాబ్ది తుదిభాగమువరకును మహావిజ్ఞానులనువారు కూడ ఆసియా, ఐరోపా, ఆఫ్రికాఖండముల యునికిని మాత్రము తెలిసికొని యుండిరి. 1492వ సంవత్సరమున మార్టిన్ బెహామ్ (Martin Behaim) అనునాతడొక గ్లోబును సిద్ధముచేసెను. మనకు తెలిసినంతవరకు అదియే మిక్కిలి పురాతనమైనది. అందు ఐరోపా, ఆసియా, ఆఫ్రికా ఖండములు మాత్రము సూచింపబడినవి. తూర్పున జపాను ద్వీపము కూడ వ్రాయబడినది. మార్కోపోలో (Marco Polo) అను సుప్రసిద్ధయాత్రికుడు తన ప్రపంచయాత్రయం దీ ద్వీపపునికిని గూర్చి వ్రాసియుండెను. పశ్చిమమున అజోరెస్ (Azores) అను ద్వీపములను మాత్రము పాశ్చాత్యులెరింగి యుండిరి. నేటికాలములో వలె పదునేనవ శతాబ్దియందు ప్రయాణ సౌకర్యములుకాని, స్థలనిర్ణయమును కావించుట కావశ్యకమైన శాస్త్రీయ సాధనములు కాని లేకుండెను. కాని ఆకాలమున కూడ సాహసికులైన కొందరు నావికులు జిబ్రాల్టరు (Gibraltar) జలసంధిని దాటి, ఆఫ్రికాఖండపు పశ్చిమ తీరము ననుసరించి గుడ్ హోప్ అగ్రమునుచేరి (Cape of Good Hope) అతి ప్రాచీనమైన భారత దేశమునకు సముద్ర మార్గమును కనుగొనిరి. ఈ కారణమున చైనా, మంగోలియా దేశములను గురించిన అనేక విషయ

ములు కూడ పాశ్చాత్యులకు తెలియవచ్చెను. పదునేనవ శతాబ్ది తుదిభాగమున మహాధీశాలియు, ధీరుడునైన క్రిస్టో ఫర్ కొలంబస్ (Christopher Columbus) అను జెనోవా (Genoa) నావికుడు అమెరికాఖండమును కనుగొని, నూతనపు భూగోళశాస్త్ర జ్ఞానమును గొప్పమార్పునకు లోనుకావిం చెను. కొలంబస్ ఆధునిక పరిశోధకులలో సగ్రస్థానమును వహించుటకర్హుడు. ఇందుల కాతడు కావించిన యనుపమాన్వే పరిశోధనలే కాక ఆతని యోగ్యతకూడ కారణమైయున్నది.

క్రిస్టోఫర్ కొలంబస్ జెనోవా నగరమున క్రీ॥ శ॥ 1447వ సంవత్సరమున జన్మించెను. తల్లిదండ్రుల కీతడే ప్రథమ సంతానము. ఈతని తండ్రి సాలెవాడు. క్రిస్టోఫర్ కు బార్థ లోమియో (Bartholomew), జేమ్సు (James) అను ఇరువురు సోదరులుండిరి. సిగిరువురును తమ అన్న యెడ మిక్కిలి భక్తి విశ్వాసములు కలవారై, ఆతడు కావించిన ఘనకార్యములం దాతనికి చేదోడువాదోడుగ నుండుట మనము ముందుముందు చూడగలము.

కొలంబస్ ఆ కాలమునాటి ఇతర బాలురవలెనే తన బాల్యమునందు విద్యాభ్యాసము గావించెను. పదునాల్గవ యేటనే యీతడు తన నౌకాజీవనమును ప్రారంభించి, మధ్య ధరా సముద్రమునం దనేక పర్యాయములు ప్రయాణము చేసెను. విరామకాలమునందీతడు, తనతండ్రి వలెనే, బట్టలు నేయుచుండెడివాడు. పాఠశాలకు పోవుటమానినను కొలంబస్ తన విద్యావ్యాసంగమును మానినవాడుకాడు. ఆతడు దేశ చరిత్ర, భూగోళశాస్త్రము, గణితము, ఖగోళశాస్త్రము,

జ్యోతిషము, తత్వశాస్త్రము మున్నగు శాస్త్రములగూర్చి తనకు లభించిన గ్రంథములన్నిటిని మిక్కిలి శ్రద్ధతో పఠించి, అందలిముఖ్యవిషయములను జ్ఞప్తియందుంచు కొనుటయే కాక వానిని వ్రాసికొని జాగ్రత్తగ కాపాడుకొనుచుండెడివాడు. తాను కావించిన సముద్ర యానములను చక్కగ జ్ఞప్తియందుంచుకొని, కొలంబస్ తా నవలంబించిన మార్గముల పటములను గీయుచుండెడివాడు. ఈ విధముగ పటములు గీయుటయందుకూడ కొలంబస్ గొప్ప నైపుణ్యమును సంపాదించెను. నౌకాయానమునందీతనికి పిన్నవయస్సునందే చక్కని కౌశలము లభించెను. గ్రంథములయందు తానుచదివిన యంశములనుగూర్చి పండితులు, విజ్ఞానులు నగువారితో తర్జన భర్జనము కావించుటయందు కొలంబస్‌కు మిక్కిలి అభిలాష యుండెడిది. కావున అవకాశము లభించినప్పుడెల్ల నౌకా సేనాధికారులు, లౌకికజనులు, గ్రీకులు, హిందూదేశీయులు, మహమ్మదీయులు మున్నగు సమస్తప్రజలతోడను తనకు తెలిసిన విషయములగూర్చి వాదించి నూతనాంశముల గ్రహించుచుండెడి వాడు.

కొలంబస్ యువకుడుగనున్న కాలము పాశ్చాత్య ప్రపంచమునందొక స్వర్ణయుగమని తెలుపవచ్చును. పాశ్చాత్య ప్రజలయం దపారమగు భావసంచలనము కావించిన మానసిక వికాసోద్యమము ఈ కాలముననే ఐరోపాఖండమునందు సర్వత్ర వ్యాపించుచుండెను. ప్రాచీన విషయములగూర్చిన జిజ్ఞాసయు, నూతనాంశముల కనుగొన వలయునను అభిలాషయు ప్రజా సామాన్యమునందు ప్రబలియుండెను.

కొలంబస్ సమకాలీనులగు నావికులతో కలిసి తరచు ముచ్చటించుచుండెడివాడు. ఐర్లాండు(Ireland) దేశమునకు పశ్చిమముగా బ్రేజిల్ (Brazil) అను గొప్ప భూఖండము కలదనియు, అది సమస్తైశ్వర్యములకును నిలయమనియు, ఆ దేశపుసంపదలను గూర్చి తమకనేక నిదర్శనములు లభించినవనియు నావికులు తెలుపుగాథలను వినుచున్నప్పుడు కొలంబస్ హృదయము నుత్సాహముతోడను, ఆనందముతోడను ఉప్పొంగుచుండెడిది. పదమూడవ శతాబ్దియందు మార్కో-పోలో అను వెనిసు యాత్రికుడు ప్రాగ్దేశములగూర్చిన యనేక వృత్తాంతములు కనుగొనియుండుట కొలంబసెరుగును. మార్కో-పోలో వలెనే తానుకూడ దీర్ఘప్రయాణములుచేసి, పశ్చిమదిశ యందుగల భూఖండమునుండి పశ్చిమముగ ప్రయాణము చేసినపక్షమున తాను జపాను, చీనా, హిందు దేశములకు పోగల్గుదునని గూడ ఆతడు తన మనస్సులో చింతించుచుండెడివాడు. ఈ యంశములగూర్చి కొన్ని సంవత్సరములు పాటు తీవ్రముగ నాలోచించిన వెనుక, కొలంబస్‌కు ఇరువది యేడవ యేట నొక నిశ్చయాభిప్రాయము కుదిరెను. ఐరోపాఖండము నుండి పశ్చిమాభిముఖముగ సముద్రయానము సాగించి హిందూదేశమును చేరవచ్చునని ఆతడు నిర్ణయించుకొనెను.

ఈ మహత్తరమైన నిర్ణయమును కొలంబస్ కేవలము యౌవనోత్సాహము వలనకాని, అన్యశక్తి వలనకాని కావించుకొనలేదు. వయోవృద్ధులకుకూడ లభింపని విజ్ఞానము నాతడు సంపాదించియుండెను. అందులకుతోడు దీర్ఘముగను, తీవ్రముగను ఆలోచన సల్పిన మీదటనే ఆతడీనిశ్చయమును

కావించుకొనెను. ఐరోపా ఖండమునుండి ప్రాఙ్ముఖముగ ప్రయాణము చేసిన నావికులు పదునేను గంటలు ముందుగ నుండెడి ప్రాంతముల చేరగల్గిరి. అనగా పశ్చిమ ఐరోపా ఖండమునందలి కాలమునకును, నావికులు చేరిన పూర్వ దేశములందలి కాలమునకును పదునేను గంటలు భేదముండెను. భూమి ఇరువదినాల్గు గంటలలో ఆత్మప్రదక్షిణము చేయునని ఆకాలమునందుకూడ జనులు తెలిసికొనియుండిరి. కావున ఐరోపానుండి బయలుదేరి పశ్చిమాభిముఖముగ తొమ్మిదిగంటల దూరమును (భూమి తొమ్మిదిగంటల కాలములో ఎంతదూరము పరిభ్రమించునో ఆ దూరము) గడచిన పక్షమున పోల్లింటినావికులు చేరిన పూర్వ దేశముల తాను చేరగలనని కొలంబస్ నిశ్చయించెను. శాస్త్రీయదృష్టిచే నాతని నిర్ణయము నిర్దుష్టమైనది. ప్రాచీనవిజ్ఞానులువ్రాసిన గ్రంథములను కొలంబస్ పరీక్షించియుండెను. ప్లినీ (Pliny) అనుగ్రీకు విద్వాంసుడు భూగత దేశము భూగోళమందలి మూడవభాగము నాక్రమించియున్నదని వ్రాసియుండెను. అది సత్యము కాదు. కాని ఆ యంశమును ఆధారముచేసికొని ఐరోపా ఖండమునకును భారత దేశమునకును విశేషదూరముండదని కొలంబస్ నిశ్చయించుకొనెను. ప్రాచీన పాశ్చాత్య వైజ్ఞానికులలో నత్యుత్తము డనదగిన అరిస్టోటిల్ (Aristotle) కూడ భారత దేశమును ఐరోపాఖండమును సమీపమున నున్నవని వచించెను. పదమూడవ శతాబ్దియందు బేకన్ (Bacon) అనువైజ్ఞానికుడు గ్రీకు, అరబ్బీ, యూద గ్రంథముల పరిశీలించి భూమియొక్క స్వరూపమును గూర్చి తగిన యభిప్రాయము నీ విధముగ

వ్యక్తీకరించెను. "భూగోళమందలి నాల్గవవంతు జననివాస మునకనుకూలమైన స్థలప్రదేశము; మిగిలినది జలమయము నని మహావిజ్ఞానియైన అరిస్టోటిల్ తెల్పినాడు. అతనిని మించిన విజ్ఞానులు మరెవ్వరునూ లేరు. అంతేకాక అలెగ్జాండరు (Alexander) వీరుని సహాయమువలన అరిస్టోటిల్ రెండు వేల మంది జనుల నీ విషయముల పరీక్షించి తనకు తెలుపవలసి నదిగా పంపియుండెను. ఈ విషయమునే సెనీకా (Seneca) యనుమరియొక విజ్ఞాని సమర్థించి యున్నాడు. కొన్ని ప్రాచీన గ్రంథములు జలమయమగు ప్రదేశము భూగోళమందలి ఏడవ వంతుమాత్రమే యని తెల్పుచున్నవి. కాని మనము అరిస్టోటిలు వాదమునే అంగీకరింపదగును. పశ్చిమ ఐరోపానుండి తూర్పుదిశగ ప్రయాణము చేసినవారు ఒక సంవత్సరములో కాని అరేబియా సముద్రమును చేరరు. ఈ కాలములో నావికులు జలమయమైన మూడువంతుల భూ భాగములో చాలదూరము నతిక్రమించియుండుట సత్యము. కావున ఇక మిగిలినది కొలదిదూరము మాత్రమే. ఈ స్వల్పదూరమును ఐరోపా ఖండమునుండి పశ్చిమ దిక్కుగ ప్రయాణముచేసి గడువవచ్చును." బేకన్ గావించిన వాదమును పదునేనవ శతాబ్దిప్రారంభమున ఒక ఫ్రెంచి విద్వాంసుడు సమర్థించెను. ఆతడు ల్యాటిన్ భాషలో "భూమియొక్క స్వరూపము" (Imago Mundi) అను గ్రంథమును రచించి వ్యాప్తకావించెను. కొలంబస్ ల్యాటిన్ భాష నెరిగియుండినందున ఆతడా గ్రంథమును చదివెను. ఆధునిక ప్రాచీన విద్వాంసుల యభిప్రాయములు తన యూహాలను బలపరచినందున కొలంబస్ హిందూ

దేశమునకు నూతన మార్గమును కనుగొను విషయమున నొక నిశ్చితాభిప్రాయమునకు రాగల్గెను.

తాను కావింప బూనిన మహాదారంభము నుపక్రమించుటకై కొలంబస్‌కు సమర్థత లేను. ఆతడు పేదవాడు. ఈ ప్రయత్నమునకు కావలసిన మనుష్యులను, ఓడలను ఆతడు స్వయముగ సమకూర్చుకొన జాలడు. ఇట్టి నూతనోద్యమములు జయప్రదముగ సాగుటకు ఎవరైన రాజులుకాని, ధనవంతులు కాని తనకు సహాయపడుట మిక్కిలి యవసరము. జనోవా పట్టణ మందిట్టివా రెవ్వరును లేకుండిరి. ఆనాడు పోర్చుగల్లు (Portugal) దేశము పరిశోధనాసక్తిగల సాహసవంతులకు పుణ్యభూమిగ నుండెను. ఆ కాలమున పోర్చుగల్లు దేశమును పాలించిన హెన్రీ (Henry) అను రాజు నూతన ప్రదేశముల కనుగొనుట యందును, నౌకా యానమును ప్రోత్సహించుట యందును మిక్కిలి ఆసక్తిగలవాడు. కావున నాతనికి "ది నావిగేటర్" (The Navigator) (నావికుడు) అను బిరుదము లభించి యుండెను. ఈతడు భూగోళశాస్త్ర బోధనమునకై ఒక ప్రత్యేక విద్యాకేంద్రము నేర్పాటు చేయుటయే కాక, హిందూ దేశమునకు సముద్రముపై మార్గమును కనుగొనుటకై కొందరు నావికులను పంపియుండెను. విజ్ఞానప్రియుడైన ఈ హెన్రీరాజు కొలంబస్ బాలుడైయున్నప్పుడే మరణించెను. కాని ఆతని కారణమున పోర్చుగల్లు దేశమునకు గొప్ప విఖ్యాతి లభించియుండెను. కావున పోర్చుగీసు ప్రభుత్వము వారి సహాయమును పొందుటకై నిశ్చయము కావించుకొని 1474 వ సంవత్సరమున కొలంబస్ ఆ దేశమును

చేరెను. పోర్చుగల్లునందు ఆతడు పది సంవత్సరములు గడ సెను. ఈ కాలమునందాతడు దేశపటములు, ఇతర భూగోళ చిత్రములను వ్రాసి జీవితము గడపసాగెను.

పోర్చుగల్లునందు నివసించుచున్న కాలమున కొలంబస్ ఫ్లారెన్సు (Florence) పట్టణమునందు నివసించుచున్న టాస్కనెల్లీ (Toscanelli) యను శాస్త్రజ్ఞునికి జాబువ్రాసి తాను కావించుకొనిన నిశ్చయమును గూర్చి ఆతనికి తెల్పెను. టాస్కనెల్లీ కొలంబస్ కావించిన సిద్ధాంతము నంగీకరించుటయే కాక తాను కూడ అదే విధముగ నిర్ణయమును కావించు కొన్నట్లాతనికి తెలియజేసెను. ఐరోపాఖండమునుండి చీనా దేశమునకు పోవుట కనుసరింపవలసిన మార్గమును తాను రచించిన పటమునందాతడు సూచించెను. టాస్కనెల్లీ అభిప్రాయము ననుసరించి పోర్చుగల్లునుండి జపాను దేశము 2500 మైళ్ళదూరమును, చైనాదేశము 6500 మైళ్ళదూరమును ఉండెను. ఈ యంశములు చూచుసరికి కొలంబస్‌కు మిక్కిలి ఆనందమును, తన నిశ్చయమును కార్యరూపము నందింపవల యునను దీక్షయు హెచ్చెను. పోర్చుగల్లురాజును సందర్శించు టకు పూర్వము తాను కావింపదలచిన మహత్తర ప్రయత్న మును, అందులకు తన్ను పురికొల్పిన కారణములను సవిస్త రముగ వర్ణించి యొక విన్నపపత్రమును ఆతడు సిద్ధపరచెను. ఈ పత్రము పోర్చుగల్లు రాజువద్దకు పంపబడెను. కొలంబస్ కావింపదలచిన మహత్తర ప్రయత్నమునుగూర్చి యెట్టి అభిప్రాయమును కావించుకొనుటకు అసమర్థుడైన ఆ రాజు, తన సలహాదారులకీ పత్రమునుపంపి, అందుపై తమ

యము దేశములను తెలుపవలసినదిగా కోరెను. ఆ కాలమునందు మతాధికారులును, పండితులును సర్వజ్ఞులుగా భావింపబడుచుండిరి. పోర్చుగల్లు రాజునకు సలహాదారులుగ నున్న సంఘమునందిరువురు మతాధికారులును, ఇరువురు వైద్యులు నుండిరి. వీరు కొలంబస్ కావించిన ప్రతిపాదన నంగీకరింపక పోవుటయేకాక తమ ప్రభువునకు కొక దుర్బోధకూడ కావించిరి. కొలంబస్ యొక్క ప్రతిపాదన కనుకూలముగ కాని ప్రతికూలముగ కాని యెట్టి ప్రత్యుత్తరమును పంపక, ఆతని సూచనలు యందెంత యథార్థము గలదో తెలిసికొనుటకై తామే కొన్ని పడవలను పంపవలయుననియు, దానివలన నేర్పడు లాభము కల్గిన పక్షమున దానినితామే అనుభవింపవచ్చుననియు, ఆ మంత్రులు రాజునకు బోధకావించిరి. వివేకరహితుడైన ఆ రాజుకూడ ఆ బోధన నంగీకరించి పశ్చిమ దిక్కుగ కొన్ని పడవలను పంపెను. కాని ఆ పడవలు భయంకరమైన తుపానులో చిక్కుకొని చాల నష్టమునకు లోనై తిరిగివచ్చెను. కొలంబసునకీ విషయము తెలియునరి కాతడు రాజుయొక్కయు, ఆతని సలహాదారుల యొక్కయు, నైచ్యము నెరిగినవాడై, అట్టివారివలన తనకు సహాయము లభించుట కల్లయని నిశ్చయించి పోర్చుగల్లునుండి వెడలిపోయెను.

స్పెయిను (Spain) దేశపు ప్రభువు నాశ్రయించి తన యుద్దేశమును నెరవేర్చుకొనవలయునను తలంపుతో 1485వ సంవత్సరమున కొలంబస్ ఆ దేశమునుచేరెను. ఆ కాలమున స్పెయిను దేశమును ఫర్డినండు (Ferdinand) అనురాజును ఇసబెల్లా (Isabella) అనురాణియును పాలించుచుండిరి. వీరిరు

వారు కూడ విశాల దృక్పథము గలవారు. అందును ముఖ్యముగ రాణి మిక్కిలి ఆలోచన, దూరదృష్టియును గల వనితారత్నము. కాని ఆ కాలమునందు స్పైను దేశమునకును, మహమ్మదీయులకును ఘోరమైన యుద్ధములు సాగుచుండెను. మహమ్మదీయులు స్పైను దేశమునందలి కొంతభాగమును తమ యధీన మందుంచుకొని పరిపాలనము చేయుచుండిరి. మహమ్మదీయులగు వారి నెల్లను తమ దేశమునుండి వెడల నడుపవలయునని క్రైస్తవులగు స్పైను పాలకుల పట్టుదల. ఇట్టి అననుకూల సమయమునందు సైతము ఇసబెల్లారాణి కొలంబస్ ను తనవద్దకు పిలిపించుకొని ఆతడు కావించిన విన్నపమును మిక్కిలి శ్రద్ధతోడను, ఓపికతోడను వినెను. యువకుడును, తేజస్వియు, ధీశాలియు, సాహసియునగు కొలంబస్ నందు రాణికి ప్రథమ సందర్శనమందే మిక్కిలి సదభిప్రాయము మేర్పడెను. కాని యిట్టి ముఖ్యవిషయమును స్వయముగ నట్టి నిర్ణయమును కావించుట కిష్టములేక యామె యతని ప్రతిపాదనపై తమ యభిప్రాయమును తెలుపవలసినదిగా మంత్రులను కోరెను. ఈ సలహాదారులలో ముఖ్యుడైన మతాధికారి స్వయముగ గొప్ప విద్వాంసుడు. కాని కొలంబస్ చెప్పిన యపూర్వ విషయములను గ్రహించుట కవసరమగు విశాల భావము లాతని కడ లేనందున నాతడీ ప్రతిపాదన నంగీకరింపక పోవుటయే కాక దాని నపహాస్యము చేసెను. ఈ విషయము ప్రజలలో కూడ వ్యాపించెను. అమాయకులగు బాలురు కూడ కొలంబస్ నొక పిచ్చివానిగ భావించి పరిహాసము చేయసాగిరి. కాని ఈ కాలమునందు కూడ కొలంబస్ యొక్క సాహస

మును గుర్తించి ఆతనిని గౌరవించినవారు లేకపోలేదు. సాలమాంకా (Salamanca) అను పట్టణము స్పైను దేశమునందలి యొక ప్రసిద్ధవిద్యాకేంద్రము. అచ్చటి మఠమున కధికారియగు సన్యాసి విశాల దృక్పథముగల విద్వాంసుడు. ఆతడు రాజకుమారునకు గురువు. ఈ సన్యాసి కొలంబస్ ఘనతను గుర్తించి ఆతని మహత్తరోద్దేశమును తనవద్ద కేతెంచు పండితులకు విశదపరచి ఆతనికి గొప్పఖ్యాతిని సంపాదించెను. స్పైను దేశమునందు నివసించుచున్నప్పుడే కొలంబస్ తన సోదరుడగు బార్థొలోమియోను ఆంగ్లదేశపు రాజగు ఏడవ హెన్రీని సందర్శించి, తన ప్రయత్నమునకు చేయూత నొసంగవలసినదిగా కోరుటకై పంపెను. కాని మహాలోభియైన హెన్రీరా జిందుల కెంత మాత్రము నంగీకరింపలేదు. ధనమును కూడబెట్టుటయో కాని వెచ్చించుట యనగా నెట్టిదియో ఆలుబ్ధరాజెరుంగడు. ఇంగ్లాండు (England) నుండి బార్థొలోమియో ఫ్రాన్సు (France) దేశమునకుపోయెను. కాని అచ్చట సైతము నతని మొర నాలకించు వాడొక్కడును లేకపోయెను. ఈ విధముగ స్పైను దేశమున నేడు సంవత్సరములు గడచి పోయెను. తన మహత్తరోద్దేశములు కార్యరూపమునందకుండ తన హృదయ సీమయందే సమసిపోవలయునని భగవదాదేశముకాబోలునని తలంచి, మిక్కిలివిచారాక్రాంతుడై కొలంబస్ స్పైనుదేశమునుకూడ విడచిపోవుటకు సంసిద్ధుడగుచుండెను. కాని నైరాశ్యసూర్యాతపముచే వాడిపోవుచున్న యూతని ఆశాలతను మిత్రసహాయమను వర్షజలములు మరల చిగురెత్తజేసెను.

కొలంబస్ మిత్రులైన కొందరు మతాధికారులాతడు స్పైను దేశమును విడచి పోవుచుండుట యెరిగి, అంతటి మేధావియు, దూరదర్శియునగు ధీరుని గౌరవింపక పోవుట దేశమునకు తీరని యవమానమనియు, స్పైను దేశము కొలంబస్‌ను మన్నింపక పోయిన మాత్రమున నాతని కెట్టి కొదువ లేదనియు, ఇతర రాజులాతనిని తమ యాస్థానమునందు తప్పక నిలుపుకొందురనియు, నూతన భూభాగముల కనుగొనిన యపూర్వ గౌరవము వారికే దక్కుననియు, స్పైను దేశమునకు జగత్ప్రఖ్యాతిని సంపాదించుటకై తనకు లభించుచున్న మహత్తరమగు నవకాశమును రాణి చేవిడువరాదనియు ఇసబెల్లారాణికి మనవి చేసిరి. వీరిలో పెరెజ్ (Perez) అనునతడు ముఖ్యుడు. ఈ సన్యాసి ఇసబెల్లారాణికి ఆధ్యాత్మిక విషయములందు గురువు. ఆతనియందు రాణికి మిక్కిలి గౌరవము. కావున కార్యాంతర వ్యగ్రురాలయ్యును రాణి యాతనిని రావించి విషయముల నన్నిటిని చర్చించి, కొలంబస్‌ను తనవద్దకు పంపవలసినదని ఆజ్ఞాపించెను. 1492వ సంవత్సరము నాటికి స్పైను దేశీయులకును, మహమ్మదీయులకును ప్రవర్తిల్లుచున్న యుద్ధము సమాప్తమయ్యెను. మహమ్మదీయులు స్పైను దేశమునుండి వెడలనడువబడిరి. తన ప్రయత్నము సఫలమగుటకింతకంటె అనుకూలమగు సమయముండబోదని కొలంబస్ సంతోషించెను. రాణి యాతని విన్నపము నసమగ్రముగవిని, ఆతడు విధించిన షరతుల నన్నిటిని సవిమర్శముగ నాలోచించి తమ యభిప్రాయమును తెలుపవలసినదని మంత్రివర్గము వారినికోరెను. తాను చేయదలంచిన మహత్తర యాత్రకు ప్రతిఫలముగ

కొన్ని అధికారములును, సదుపాయములును తనకు కావలె నని కొలంబస్ కోరెను. తాను కనుగొనిన ద్వీపములన్నిటి యందును తనకు నౌకాసేనాధిపతియను బిరుదమును దానికి సంబంధించిన అన్ని యధికారములును లభింపవలెను. ఈద్వీప ములన్నిటికిని తాను పరిపాలకుడుగను, రాజప్రతినిధిగను పరి గణింప బడవలెను. ఆ నూతన దేశములలో లభించిన ధన మందు పదవ వంతు తనకు దక్కవలయును. ఇట్టిదే మరియొక షరతును కూడ కొలంబస్ విధించెను. మంత్రివర్గమువా రీని యమము లెంతమాత్రమును అంగీకార యోగ్యములు కావని నిర్ణయించిరి. ఈ నిశ్చయము వినుసరికి కొలంబస్ ఆశాసౌధ ములన్నియు కూలిపోయినట్లయ్యెను. కాని ఆతడు మనోధై ర్యమును మాత్రము కోల్పోవలేదు. ఎంతటి నిరాశాజనకము లైన పరిస్థితులలో కూడ కొలంబస్ తన లక్ష్యమునందు విశ్వా సమును కోల్పోవుటకాని, నిర్ణయముల మార్చుకొనుటకాని, భీరునివలె వర్తించుటకాని కావింపలేదు. తన ప్రయత్నము లను భగ్నము కావించిన మంత్రివర్గమువారి నెన్నడు నిందింప లేదు. కాని పదునేడు సంవత్సరముల నుండియు తాను కావిం చుచున్న యత్నములు నిష్ఫలమగుట కాతడు విచారించెను. యౌవన దశ మీరి ప్రౌఢదశ ప్రారంభమగుచున్నను జీవిత మందాశాజ్యోతి కాన్పింప నందున కొలంబస్ హృదయము చింతాక్రాంతమయ్యెను. ఆతడు స్పైను దేశమును వీడి మెల్ల మెల్లగ ఫ్రాన్సు దేశమును చేరుటకై ప్రయాణము సాగించెను. కాని ఇంతలో ఆధీర హృదయుని యదృష్టచక్రము తిరిగెను. ఇసబెల్లా రాణి దూరదృష్టి కలది. కొలంబస్ కావిం

చిన ప్రతిపాదనల యందునను, ఆతని సామర్థ్యమునందును సంపూర్ణ విశ్వాసముగలది. కావున మంత్రివర్గము వారొసంగిన సలహాను త్రోసిపుచ్చి కొలంబస్ కోరిన షరతుల సంగీకరించి ఆతనికి కావలసిన సహాయముల నొసంగుటకై ఆమె నిశ్చయించెను. కావున తన సేవకులలో నొకనికి స్వహస్త లిఖితమగు ఆజ్ఞాపత్రము నొసంగి, కొలంబస్‌ను తిరిగి రావలసినదనియు, ఆతడు కోరిన షరతులనన్నిటిని తానంగీకరించితిననియు ఆమె వర్తమాన మంపెను. ఈ ఆదేశమునుచూచి సంతోషించి కొలంబస్ స్పైను దేశమునకు తిరిగివచ్చెను. రాణివద్ద తగినంత ధనములేదు. కాని అమూల్యములైన తన ఆభరణములనైన కుదువబెట్టి కొలంబస్‌కు సహాయము చేయుటకై ఆమె నిశ్చయించెను. కాని ఆవశ్యకమైన ధనము రాణి కప్పుగా లభించెను. నగలను కుదువబెట్టవలసిన ఆవశ్యకత కలుగలేదు.

1492వ సంవత్సరము ఏప్రిలు నెలయందు కొలంబస్ కును స్పైనురాజునకును అన్ని విషయములందును ఏకాభిప్రాయము కుదిరెను. కొలంబస్ కావింపదలచిన మహత్తర యత్నము నకై కావలసిన యేర్పాట్లన్నియు చేయబడెను. ఈ యాత్ర యందు కొలంబస్‌కు మూడు పడవలుమాత్రమే యొసంగబడెను. వీనిలో పెద్దఓడ సాంటామేరియా (**Santa Maria**) అనునూరు టన్నులనౌక. ఆకాలమందలి అన్ని యోడలవలెనే అదిమోటుగను, దీర్ఘప్రయాణముల కననుకూలముగను నిర్మింపబడెను. ఈ పడవను కొలంబస్ స్వయముగ నడిపించెడివాడు. పింటా (**Pinta**) యను రెండవయోడ ఏబదిటన్నులపడవ. దీనినిపునర్నిర్మాణముగావించుటకై కొలంబస్ చాలధనమును వెచ్చించెను.

కాని యీ పిన్నదగు ప్రయాణములో నావికులను చాలతిప్పలు పెట్టెను. మూడవది నీనా (Nina) యను నలుబది టన్నుల పడవ. ఇది అన్ని పడవలలో పరిమాణమున మిక్కిలి చిన్నది యయ్యును శీఘ్రప్రయాణమునకు మిక్కిలి ఉపయోగకర మైనదిగ పరిగణింపబడెను. ఈ ప్రయాణమునందు కొలంబస్‌తో ఎనుబది యెనమండుగురు నావికులు పాల్గొనిరి. వీరిలో నొక ఆంగ్లేయుడును, ఒక ఐర్లాండు దేశీయుడును కూడ నుండిరి. ఈ మహోత్తర ప్రయత్నమున పాల్గొనిన నావికులందరి నామములును నేడు మనకు లభ్యమగుచున్నవి. 1492 వ సంవత్సరము ఆగస్టు రెండవ తేదీని నావికులందరును పెలాస్ (Palos) అను రేవుపట్టణమును చేరిరి. కొలంబస్ కావింప దలచిన మహోత్తర ప్రయత్నము విజయవంతము కాగలందులకై క్రైస్తవ దేవాలయములలో ప్రార్థనలు గావింపబడెను. మతగురువులు కొలంబస్‌ను, నావికులను ఆశీర్వదించిరి. ఆ మరునాడు 1492 వ సంవత్సరము ఆగస్టు మూడవ తేదీని కొలంబస్, ప్రపంచ చరిత్రయందు ధైర్యసాహసములకు సాటిలేని, యీ మహోత్తర ప్రయాణము నారంభించెను.

మొదట వీరు కానరీ ద్వీపులకు (Canary Islands) ప్రయాణము చేసిరి. త్రోవయందు పింటా యనుఓడ చుక్కాని విరిగిపోయెను. దీనిని బాగుచేసికొనుటకును, ప్రయాణమునకై కావలసిన మంచినీటిని, ఆహార పదార్థములను సేకరించుకొనుటకును కొలంబస్ ఆ ద్వీపమునందు నెలదినములు గడపెను. పిదప సెప్టెంబరు తొమ్మిదవ తేదీని దారితెన్నులు తెలియని గంభీరమగు అట్లాంటిక్ (Atlantic) మహాసముద్ర

మునందు వారు ప్రయాణమును ప్రారంభించిరి. కొలంబస్ ననుసరించిన నావికులందరును సముద్రయానమునందారితేరిన వారు. వారియనుభవ మపారమైనది. కాని నూతనమగు నీ జలరాశిని చూచుసరికి వారిలో పలువురకు గుండెలు చెదరి పోయెను. జపానుదేశము స్పైనునుండి రెండువేల మైళ్ళ దూరమున మాత్రమున్నట్లు కొలంబస్ నిశ్చయముగ విశ్వసించి యుండెను. కాని నేడుమనమెరింగినట్లుగ ఈ రెండు దేశములకును పండ్రెండువేల మైళ్ళదూరము కలదని తెలిసిన యెడల కొలంబస్ వంటి ధీరుడుగూడ ఈ సాహసకృత్యమునకు పూనుకొని యుండెడివాడు కాడు. ఏలనన ఇట్టి దీర్ఘప్రయాణ ములు కావించువారును దూరదేశములకుపోయిన మరల వెనుకకు తిరిగి రావలసియుండును. ఆ కాలమునందు నేటివలె ఆహారమును చాలదినములపాటు నిలువయుంచు పద్ధతులు జనులకు తెలిసియుండలేదు. ఇట్టి దీర్ఘ ప్రయాణములు చేయు వారు తమతో ఉప్పుడుచేపలను, వివిధ మృగముల మాంసమును తీసుకొనిపోయెడివారు. కాని కొన్నిదినముల తరువాత పైయాహారపదార్థములు దుర్గంధమును వెడలగ్రక్కుడివి. అప్పుడుకోసి తెచ్చిన ఆకుకూరలతో కాని, కాయగూరలతో కాని కలిపివండినకాని అవి రుచికరముగ నుండవు. అంతేకాక అవి అనేకవ్యాధులను కల్గించును. దీర్ఘప్రయాణము నందు కావలసిన మంచినీటిని తమవెంట తీసుకొనిపోవుట సాధ్యముకానందున, ఆ కాలపునావికులు వర్షపునీటిని పెద్దపాత్రల యందు నింపుకొని వానినే వాడుచుండెడివారు. ఆ కాలము నందు భూమిస్వరూపమును గూర్చి విచిత్రకథలు వ్యాప్తియుం

దుండెను. భూమిపైవలెనే సముద్రమునందుకూడ నిమ్నోన్నతములుండుననియు, ఓడలు కొండలంతటి యెత్తైనప్రదేశముల పైకెక్కి క్రిందకు దిగవలయుననియు, ఆ సందర్భములలో పడవలు సురక్షితముగ నుండగల్గుట దుస్తరమనియు పలువురు నావికులు భయపడసాగిరి. దినదినమును తాముగడచిన దూరమును కొలంబస్ తనకడగుర్తు పెట్టుకొనుచుండెడివాడు. కాని నిజమైన దూరమును నావికులకు చెల్పిన పక్షమున వారు స్వదేశమునకు చాలదూరమైపోవుచున్నామని భయపడగలరని యెరింగి కొలంబస్ దానిని తగ్గించి చెల్పుచుండెడివాడు. కొన్నిదినములు ప్రయాణముచేయునరికి పడవలు వ్యాపార పవనముల మార్గమునకు వచ్చెను. ఆ వాయువుల సహాయమున ప్రయాణము సులభమయ్యెను. కాని తిరిగివచ్చునప్పుడు నిరంతరమును వీచుచుండు గాలుల కెదురుగ ప్రయాణము చేయుట యెట్లు సాధ్యమగునని నావికులకు మరియొక శంక జనించెను. మూడువారములు ప్రయాణముచేయునరికి నావికులకు భూమి సమీపమునవున్నట్లు భ్రమకల్గెను. నిజమునకవి దూరమున సముద్రముపై వంగియున్న మేఘపటలములు. ఈ ఆశాభంగమువలన నావికులలో అశాంతి బయలుదేరెను. భయానకమైన ఆ సముద్రమునందొక యుగముకైన ముందునకు సాగిపోమని వారు శపించిరి. కొలంబస్ నయమునను, భయమునను వారిని వశపరచుకొనుటకై యత్నించెను. ఎవ్వరును తన్ననుసరింపకపోయినను తానొక్కడే ముందునకు సాగిపోయి భగవత్కృపవలన నూతన దేశములను కనుగొనగలనని ప్రకటించెను. కొలంబస్ చూపిన స్థైర్యమును, చాక

చక్రమును తుదకుఫలవంతము లయ్యెను. నావికులెల్లరును ఆతని యాజ్ఞలకు బద్ధులై తమ తమ పనులయందు నిమగ్నులైరి. అక్టోబరు పదునొకండవ తేదీని భూమినిసమీపించుచున్నట్లు వారికి స్పష్టమైన నిదర్శనములు కానవచ్చెను. క్రొత్తగ చెట్టునుండి విరిగిపడిన కొమ్మయొకటి వారికి కాన్పించెను. సముద్రముపై తేలుచున్న బెర్రీలుగలకుంచె వారికి మార్పుచూపట్టెను. ఇంతవరకును వారుచూచినవి జల పక్షులు. ఇప్పుడు కాన్పించినవి చెట్లపైనివసించు విహంగములు. అదే దినమున రాత్రిసమయమున దూరమునందు నావికులకొక దీపముకాన్పించెను. ఆ దీపమొక ప్రదేశమున నిలచి యుండక ఇటునటు తిరుగుచుండుటవలన నయ్యది మానవు లుపయోగించు నొక కరదీపిక యని నావికులు నిశ్చయించిరి. తమకుకాన్పించినది భూమియేనని నిశ్చయముగ తెలిసికొనుటకై కొలంబస్ తన పడవల నా కాంతిదిక్కునకు మరల్చి నడిపించెను. మూడుఓడలయందును పింటాయనునది వేగముగ ప్రయాణముచేయగలది. కావునదానిని ముందు నడుపవలయునని నాతడాజ్ఞాపించెను. ఆనాటిరాత్రి ఆకాశము నిర్మలముగ నుండెను. చంద్రుడు వెలుగుచుండెను. కొంత కాలము సాగిపోయినతర్వాత రాత్రి రెండుగంటలకు వారికి భూమి స్పష్టముగ కానవచ్చెను. ఆ విషయము తెలియుసరికి నావికులందరును బ్రహ్మానంద భరితులై భూమి కాన్పించినదని కేకలువేయసాగిరి. తన ఓడయందలి గదిలో ఆలోచనా నిమగ్నుడై యున్న కొలంబస్ ఈ కలకలము విని బయటికి వెడలివచ్చెను. భూమి యనతిదూరమున కానవచ్చెను. రాత్రి

సమయమున ఒడ్డునుచేరుట ప్రమాదకరమని చింతించి, శేషరాత్రము నచ్చటనే గడుపవలెనని ఆతడాజ్ఞాపింపగా పడవలన్నియు లంగరులు దింపివైచెను.

తెల్లవారుసరికి వారి కొకద్వీపము స్పష్టముగా కాన్పించెను. అందు నివసించుచున్న ప్రజలు గోధుమవర్ణము వారు. వారిందఱును దిగంబరులుగా నుండిరి. వారి ప్రవర్తనమును, ముఖచిహ్నములును వారు శాంతి ప్రియులును, ఇతరులతో సఖ్యము నెరపు స్వభావముగల వారనియు తోపఁజేసెను. వారికడ నెట్టి ఆయుధములును లేకుండెను. కావున కొలంబస్ కొందరు అనుచరులను వెంట బెట్టుకొని, స్పైను దేశపు పతాకమునుచేత ధరించి, ఒక చిన్న పడవలో తీరమునుచేరెను. వారు తమ దేశ పతాకము నచ్చట ప్రతిష్ఠించి, తమ్ము సురక్షితముగ నొడ్డుచేర్చినందులకు మోకరించి పరమేశ్వరునకు ధన్యవాదము లర్పించిరి. తాను చేరిన ద్వీపమేదియో కొలంబస్‌కు తెలియదు. అయినను చిర కాలమునుండి తాను కాంక్షించుచున్న ప్రయత్నము సాగుటయేగాక అది ఫలవంతమైనందులకు ఆతని హృదయ మత్యానందభరితమయ్యెను. కొలంబస్ మున్నగువారు తమ చిన్నయోడలలో మూడువేలమైళ్ళ దూరమును గడచి వచ్చియుండిరి. వారు దిగినప్రదేశము ఆహ్లాదకరముగ నుండెను. భూమి సారవంతముగ నున్నట్లు నిదర్శనములు కాన్పింపసాగెను. కొలంబస్ ఈ ద్వీపమునకు సాన్ సాల్వడార్ (San Salvador) అను నామమొసంగెను. తాను హిందూదేశమునకు సమీపమునందున్న యొక

ద్వీపమును చేరితినని ఆతడు భ్రమపడెను. చిరకాలమునుండి ఆతడు చదువుచున్న గ్రంథములును, వినినచర్చలును, కావించిన యూహలును ఈ అపోహము నాతని మనస్సున గట్టిగ పాదుకొల్పియుండినందున అచ్చటి ప్రజలను హిందూదేశీయులని ఆతడు పిలువసాగెను. ఈ దీవులకు పశ్చిమ ఇండియా దీవులని నామధేయ మొసంగెను. నిజమునకు ఆ ద్వీపము నేటి బహామాదీవులలో (Bahama Islands) నొక లంకయని తరువాత తెలియవచ్చెను. కొన్నిదినముల తరువాత నైఋతి దిక్కుగ ప్రయాణముచేసి కొలంబస్ మరికొన్ని ద్వీపములను కనుగొనెను. వానిలో నేడు మనము క్యూబా (Cuba) యని పిలుచుచున్న ద్వీపమొకటి. ఈ విధముగ మరి కొన్ని ద్వీపములుకూడ కనుగొనబడెను. ఇచ్చట ప్రజలందరునుకూడ ఆగంతకులతో స్నేహధర్మమునే పాటించిరి. కొలంబస్ తనకు కాన్పించిన నూతనప్రజలకు బహుమానములొసంగియు, అత్యంత సౌజన్యభావమును ప్రదర్శించియు వారితో శీఘ్రముగా స్నేహము కావించికొనెను. పశ్చిమ ఇండియాదీవులలో నీవిధముగ ప్రయాణముసల్పుచు క్రిస్టమస్ పండుగనాడు వారు హిస్పానియోలా (Hispaniola) అను ద్వీపమునుచేరిరి. అచ్చట ప్రమాదవశమున కొలంబస్ నడపుచున్న సాంటామేరియా యను ఓడ పగిలిపోయెను. కావున అందలి వస్తువులనన్నిటిని తీరముపై దింపి జనముకూడ దిగిపోయిరి. కొన్నిదినములకు పూర్వమే పింటాయను పడవ మాయమయ్యెను. నీనా మాత్రమిప్పుడు సరియైన స్థితియందుండెను. పగిలిపోయిన పెద్దయోడకు సంబంధించిన కలపతో నొక

చిన్న దుర్గమును నిర్మించుకొని కొలంబస్ ప్రభృతులు "లా నవిడాడ్" (La Navidad) అను ఆ ప్రదేశమున కొంత కాలము గడపిరి. కాని పింటా యోడ మరలిరాలేదు. కావున మిగిలియున్న నీనాయను పడవయందే తాముతిరిగి స్వదేశము నకు మరలి పోవలయునని కొలంబస్ నిశ్చయించెను. కాని సాంటా మేరియా యోడలోని నావికులనందరిని నీనా మోయ జాలదు. కావున నలుబదిమంది నావికులు హిస్పానియోలా యందు దిగబడిపోవలెను. తాను స్పైను దేశమునకు మరలి పోయి అచ్చటినుండి మరియొక యోడనుపంపి, వారిని వెనుకకు పిలిపించుకొందుననియు, అంతవరకును ఆ ద్వీపమునందుండుట కెవ్వరంగీకరింతురో తెలుపవలసినదనియు కొలంబస్ కోరెను. నలుబదిమంది నావికులు సంతోష పూర్వకముగ నందుల కంగీకరించిరి. వారికి కావలసిన ఆహారపదార్థముల సేకరించి దుర్గమున పొందుపరచి, తానువచ్చువరకును వారందరును జాగ్రత్తగ కాలక్షేపము చేయవలెననియు, ఒంటరిగ నెవ్వరును ద్వీపమధ్యమునకు పోరాదనియు, స్థానికులగు ప్రజలతో నెంతమాత్రమును తగవులాడ రాదనియు, వారికి మంతబోధ కావించి, తనకు సమీపబంధుడగు అరానా (Arana) అను వాని నా ద్వీపమునకు పాలకునిగ నియమించి, పదునెనిమిదిమంది నావికులనుమాత్రము వెంటబెట్టుకొని కొలంబస్ నీనాయోడయందు స్వదేశమువైపు మరలెను. త్రోవయందు తుపానులవలనను, ఇతర కారణముల వలనను వారికి చాలకష్టములు సంభవించెను. కాని వానినన్నిటిని గడచి కొలంబస్ నుఆతని మిత్రులును 1493 వ సంవత్సరము

మార్చి నెల 15 వ తేదీని తాము బయలుదేరిన పెలాస్ అను రేవుపట్టణమును మరలచేరిరి.

కొలంబస్‌ను, అతని అనుచరులను తిరిగి వచ్చుసరికి స్పైను దేశమునందు గొప్ప కలవరముకలిగెను. వారందరును మృత్యు ముఖమునుండి వెడలివచ్చినట్లు జనులాశ్చర్యపడ సాగిరి. ఈ నావికులతోకూడ వచ్చిన పశ్చిమఇండియా ద్వీప వాసులనుచూచి జనులు మరింత అబ్బురపడిరి. స్పైను దేశపు రాజును, రాణియు కొలంబస్ కావించిన సాహస కార్యమునకై మిక్కిలి సంతసించి అతనిని అనేక విధముల గౌరవించిరి. ఈతని ప్రయత్నమునలన సారవంతములైన విశాల భూభాగములు తమ సామ్రాజ్యములో చేరుచున్నందు లకు వారియానందము మేరమీరెను. ఈ నూతన ప్రపంచ మున బంగారము విరివిగ లభించునని ప్రజలకు తెలియ వచ్చెను. ఒకనాడు పిచ్చివానిగ పరిగణించి అపహాస్యము చేసిన కొలంబస్ నందరును దైవసమానునిగ భావింపసాగిరి. స్పైను ప్రభుత్వమువారు కొలంబస్‌ను మరియొక పర్యాయము మీద్వీపములకు పోవలసినదని కోరిరి. ఈమారాతనికి మూడు పెద్దయోడలను, పదునాల్గు చిన్నపడవలును ఈయబడెను. నూతనదేశములకు పోయి శీఘ్రముగా ధనవంతులు కావలయు నను ఆశతో అనేకులు యువకులు కొలంబస్‌తో ప్రయాణము చేయుటకు ముందంజ వేసిరి. ఈ విధముగ సుమారు పదునేను వందల జనులు పశ్చిమఇండియా దీవులకు ప్రయాణముకట్టిరి. ఈ ప్రయాణమునందు మానవులేకాక గుఱ్ఱములు, గాడిదలు, కంచరగాడిదలు, ఆవులు, గొఱ్ఱెలు, పందులు, పక్షులు

మున్నగునవియుండ నుండెను. వ్యవసాయము నిమిత్తమై వీరు వివిధ ధాన్యములకుండ కొనిపోయిరి.. నూతన దేశమున శాశ్వతనివాస మేర్పరచుకొనుటకై అన్ని ప్రయత్నములును కావింపబడెను. 1493 వ సంవత్సరము అక్టోబరు నెలయందు స్పైను దేశమునువీడి కొలంబస్ను, అతని పరివారమును నవంబరు నెలయందు దక్షిణ అమెరికా సమీపమందలి ద్వీపములను చేరిరి.

హిస్పానియోలా ద్వీపమునందు తనతోటివారిని కొందరను దిగవిడచి వచ్చియుండిన కారణమున వారి క్షేమమును తెలిసికొనునిమిత్త మచ్చటికి సూటిగపోవలయు నని కొలంబస్ తొందరపడుచుండెను. కాని మార్గమధ్యమున కొన్ని నూతన ద్వీపము లడ్డువచ్చినందున వానిని పరీక్షించుట యందు కొంత కాలయాపన జరిగెను. ఈ ప్రయత్నములో కొలంబస్ డామినికా (Dominica), గుడలోప్ (Guadaloupe) మున్నగు ద్వీపముల కనుగొనెను. అనతి కాలములో కొలంబస్ మొదలగువారు హిస్పానియోలా ద్వీపమును చేరిరి. కాని అచ్చటి పరిస్థితులు చూచుసరికి ఆతనికి మిక్కిలి ఆశా భంగమును, విచారమును కలిగెను. కొలంబస్ దయార్ద్ర హృదయుడు. తాను కనుగొనిన నూతన ద్వీపములపై గల ప్రజలతో స్నేహభావమును నెరపి, వారిమైత్రిని సంపాదింప వలయునని ఆతడెల్లప్పుడును వాంఛించెడివాడు. అట్టిహిత బోధనే ఆతడు హిస్పానియోలా ద్వీపమునందు విడనాడి పోయిన అనుచరులకు కావించియుండెను. కాని వా రాహిత వాక్యముల పెడ చెవిని బెట్టి, బంగారమును కూడబెట్టవలయు

నను పేరాసతో వర్తించి, ద్వీపవాసులతో జగడములు పెట్టుకొని, వారిలో కొందరిని చంపి, వారి స్త్రీల నవమానపరచి, చాల అవివేకముగ వర్తించిరి. అందువలన ఆద్వీపపు నాయకు లాగ్రహించి శెల్లవారి నందరను స్వర్గ సంలేకుండ నాశనముచేసిరి. నూతన జాతులయెడ తానను సరింపదలచిన నీతిని తన అనుచరు లతిక్రమించినందులకును, వారిసర్వ నాశనమునకును కొలంబస్ మిక్కిలి చింతించెను. అయినను అధైర్యముచెందక ఆతడు హిస్పానియోలా ద్వీపమునందు శాశ్వత నివాసములనేర్పరచుటకై ప్రారంభించి, స్పైను దేశపు రాణియైన ఇసబెల్లా పేరిట ఒక పట్టణమును స్థాపించెను. ఆ పట్టణము క్రమ క్రమముగా అభివృద్ధి చెందసాగెను. పరిస్థితులు కొంతవరకు చక్కబడిన తర్వాత కొలంబస్ ఆద్వీపమునకు తన సోదరుడగు జేమ్సు అను వానిని పాలకునిగ నియమించి పరిసరద్వీపములను పరిశోధించుటకై బయలు వెడలెను. ఈ ప్రయత్నమందాతడు జమైకా (Jamaica) అను ద్వీపమును కనుగొనెను. బాల్యమునుండియు కొలంబస్ మిక్కిలి కష్టభరితమైన జీవితమును గడపియుండెను. నిరంతర ప్రయాణముల వలనను, విశ్రాంతిలేని కారణమునను అతని ఆరోగ్యము చెడెను. దృష్టిమందగించెను. కీళ్లనొప్పులాతనిని చాలబాధింపజొచ్చెను. ఇట్టిస్థితిలో నాతడు హిస్పానియోలాకు తిరిగివచ్చెను. అచ్చట అతనిసోదరుడగు జేమ్సు అనేక కష్టములకు లోనై యుండెను. అనుచరులాతనిపై తిరుగుబాటుచేసిరి. జేమ్సు సజ్జనుడేకాని పరిపాలకుని కుండవలసిన శాంత్యమును, మనోనిశ్చయము నాతనికడ లేవు. నాయకుడైన కొలంబస్

రోగగ్రస్తుడై లేవలేని స్థితియందుండిన కారణమున తిరుగుబాటుదారుల కింకను ధైర్యము హెచ్చెను. కాని అదృష్టవశమున నీ సందర్భమునందే కొలంబస్ మొదటి తమ్ముడైన బార్థలోమియో అనునాతడు కొన్ని పడవలతో తన యన్న సహాయమునకై స్పైను దేశమునుండి వచ్చిచేరెను. ఈతడు కొలంబస్ వలెనే ఆరితేరిన నావికుడు; ధైర్యశాలి; సమర్థుడైన పాలకుడు. కాని కొలంబస్ నకు గల విజ్ఞానమును, సౌజన్యమును, సహనశీలతయు ఈతనియందు కొరవడియుండెను. ఈ సోదరుడు వచ్చిచేరినందున కొలంబస్ కు కొండంత బలము చేకూరెను. బార్థలోమియోపరిపాలనాధికారమును చేబూని, అన్నకు ఆరోగ్యము కలుగునవరకును సమర్థతతో నిర్వహించెను. ఈ కాలమునందు కొలంబస్ యెడ ద్వేషము వహించి ఆతనిపై తిరుగుబాటు చేసినవారిలో కొందరు ఆతని అనుమతి లేకుండగనే స్పైను దేశమునకు మరలిపోయిరి. వారు తన్నుగూర్చి అపవాదములను ప్రచారముచేసి, ప్రభుత్వమువారికి కొండెములు చెప్పెదురని కొలంబస్ భయపడెను. తమ్ముని పరిపాలనము కావించుచున్నప్పుడు హిస్పానియోలాయందలి స్థానిక నాయకులు మరల తెల్లవారిపై దాడి చేసి కొంత నష్టమును కల్గించిరి. ఇక ఉపేక్ష చేయుటవలన ప్రమాదము తప్పదని నిశ్చయించి, కొలంబస్ తనకడనున్న స్వల్పసేనతో వారి నెదిర్చి సంపూర్ణముగ నోడించి, వారి నాయకుని చెరపట్టెను. ఈ యుద్ధమునందు స్థానిక ప్రజలు మరణించుట కొలంబస్ కు మిక్కిలి విచార కారణమయ్యెను. ఈ విధముగ హిస్పానియోలాయందు తన అధికారమును స్థిర

పరచుకొని, తన సోదరుడగు బార్థొలోమియోను అచ్చట తనకు ప్రతినిధిగ నియమించి 1496 వ సంవత్సరమున కొలంబస్ స్పైనుదేశమునకు వెడలిపోయెను. రాజును, రాణియు ఆతనిని మిక్కిలి గౌరవించిరి. కాని సామాన్యకుటుంబమున జన్మించిన యొక నావికుడు రాజాస్థానమున విశేష గౌరవము సంపాదించుచున్నందులకు అచ్చట పలువురకు కన్నెఱ్ఱగ నుండెను. కొలంబస్ నేవిధముగనైన క్రుంగదీయవలయునని వారు వేచియుండిరి. కాని రాజానుగ్రహమువలన నాతనికెప్పు డెట్టి నష్టమును సంభవింపలేదు. అంతేకాక స్పైనుప్రభుత్వమువారు ఆతనికి మరికొన్ని పడవల నొసంగి, ఇంకను నూతన ప్రదేశములను కనుగొనవలెనని ఆజ్ఞాపించిరి. 1498 వ సంవత్సరమున నాతడు మూడవపర్యాయము అమెరికా ఖండమున కేగెను.

ఈ ప్రయాణసందర్భమున నాతడు బుద్ధిపూర్వకముగనే తన పడవలను దక్షిణముగ నడపించి జూలై నెల (1498) యందు దక్షిణ అమెరికా సమీపమందలి ట్రినిడాడ్ (Trinidad) ద్వీపమును చేరి, దానిని పరిశోధించెను. మరి కొంత ముందునకు సాగిపోయి కొలంబస్ దక్షిణ అమెరికా ఖండముపై కాలిడెను. సువిశాలమైన యా భూభాగమును, అచ్చటి గంభీరమగు నదీరాజములను చూచుసరికి నదియొక గొప్ప భూఖండమని ఆతడు గుర్తించెను. కాని అప్పటికిని కూడ అది ఆసియాఖండమునకు సమీపముననున్న ఒక ద్వీపమనియే ఆతడు భ్రమపడసాగెను.

1499 వ సంవత్సరమున కొలంబస్ అనుచరులలో

నొకఁడుగనుండిన ఒజేడా (Ojeda) అనునాతడు అట్లాంటిక్ సముద్రములో ప్రయాణముచేసి కొలంబస్ వలెనే నూతన ప్రదేశములను కనుగొనుటకై స్వతంత్రముగ ప్రయత్నము చేసెను. ఈతని పరివారములో అమెరిగో (Amerigo) అను నాతఁడొకడు చేరియుండెను. అమెరిగో జెనోవా పట్టణములో ఒకవర్తకుఁడు. ఈతడు తాను అమెరికా ఖండమునకు నాల్గు పర్యాయములు ప్రయాణముచేసి అచ్చటి విశేషములను సవిస్తరముగ తెలిసికొన్నట్లు ప్రకటించి, ఆ విషయముల కొన్ని లేఖలయందు పొందుపరచెను. అమెరిగో వ్రాసిన లేఖలు పలువుర దృష్టినాకర్షించెను. ఫ్రెంచి, ల్యాటిను భాషలలో నవియనువదింపఁబడెను. ఒకానొక జర్మను దేశీయుఁడీ లేఖలనుచదివి, ఆశ్చర్యపడి, సత్యవిషయముల నెఱుంగఁజాలక అమెరిగో అనువాడు గొప్పపరిశోధకుఁడనియు, ఆతడే యీ భూఖండమును కనుగొనియుండుననియు తలంచెను. తాను వ్రాసిన యంశముల నొక చిన్నపుస్తకమునందు వర్ణించి, ఈ జర్మను దేశస్థుడు అమెరిగో అనువానిచే కనుగొనఁబడిన యీ విశాల భూభాగమున కాతని గౌరవార్థము అమెరికా (America) అని నామకరణముచేయుట సమంజసమని సూచించెను. ఈ సూచన జనులకు రుచించెను. కావున వారీనూతన ఖండము నమెరికాయని పిలువసాగిరి. కొలంబస్ చే కనుగొనఁబడిన యీ ఖండమునకు కొలంబియా యనునామ మొసంగుట సమంజసమని యెల్లరును నంగీకరింతురు. కాని విత్తునాటువాడొకడును, దాని ఫలమునను భవించువాడు వేరొకడు ననుయంశము సర్వవిదితము.

1496 వ సంవత్సరమున హిస్పానియోలా ద్వీపమును వదలివెడలిన కొలంబస్ 1498 తుదిభాగమున గాని మరలిరాలేదు. ఈ రెండు సంవత్సరములలో ఆతని సోదరుడగు బార్థొలోమియో పరిపాలనాధికారమును వహించెను. ఇతడు సమర్థుడేకాని నీతిపరుడు కాడు. కొత్తగ అచ్చట నివసించుచున్న స్పైను ప్రజలకందరికిని ఆతడనిష్టుడయ్యెను. స్వదేశీయుడు కాని ఆతనియధికారము నంగీకరించుటకు పలువురు నిరాకరించిరి. వీరందరును కొలంబస్ పైనను, ఆతనిసోదరుల పైనను కక్షపూని స్పైను దేశమునకు మరలిపోయి ప్రభుత్వముతో ఆతనినిగురించి అనేక నేరములను కల్పించి చెప్పిరి. రాజసభయందుకూడ కొలంబస్ యెడ అసూయచెందిన ఆతనిని ద్వేషించువారు పలువురుండిరి. కొలంబస్ విరోధులవలనను రగుల్కొల్పబడిన ద్వేషాగ్నికి వారింధనము సంపాదించిరి. ఫర్డినండ్ రాజును, ఇసబెల్లా రాణియు కొలంబసు యెడ సంపూర్ణ విశ్వాసముకలవారు. కాని ఆతనిపై పలువురు గావించిన నేరారోపణల సక్రమముగ విచారింపకపోవుట రాజధర్మమునకు విరుద్ధమని తలంచి, హిస్పానియోలా ద్వీపమునకేగి, పరిస్థితుల విచారించి, నిజస్థితిని తమకు తెల్పుటకై వారు బొబడిల్లా (Bobadilla) అను ఉద్యోగిని నియమించిరి. కొలంబస్ పై కావింపబడిన నేరారోపణలు నిరాధారములుగ నాతడు (బొబడిల్లా) నిర్ణయించునని ఇసబెల్లా రాణి ఆశపడెను. కాని ఆ యాశలు ఫలింపలేదు.

బొబడిల్లా మిక్కిలిగర్విష్టి. దంభము కలవాడు. కొలంబస్ నెడ ఆతనికెట్టి సదభిప్రాయమును లేదు. ఆతడు

హిస్పానియోలా ద్వీపమునకు పోవుసరికి కొలంబస్‌ను, అతని సోదరుడు బార్థొలోమియోయును, స్థలాంతరమునకుపోయి యుండిరి. అసమర్థుడగు జేమ్సు పరిపాలనము చేయుచుండెను. బాబడిల్లా అచ్చటికి కేతెంచి కొలంబస్ ఇంటిని బలవంతముగ సరిపించి, అందలిన వస్తువులను, విలువగల కాగితములను వశపరచుకొని ప్రభుత్వమును స్వాధీనపరచుకొనెను. నిజమున కాతనికి కొలంబస్‌ను తొలగించుటకు అధికారములేదు. అయినను ఆతడు నిరంకుశముగ వర్తింపసాగెను. కొలంబస్ తిరిగివచ్చి అచ్చటి పరిస్థితులగాంచి మిక్కిలి ఆశ్చర్యపడెను. బాబడిల్లా కావించిన దౌర్జన్యమును తగువిధముగ ప్రతిఘటింపచుటకు సమర్థుడయ్యు ఆతడందులకు పూనుకొనలేదు. బాబడిల్లా కొలంబస్‌ను రావించి సర్వాధికారములును తనకు సమర్పబడినట్లు తెలియజేసెను. కొలంబస్ శాంతముగ అతని పల్కులను విని, రాజాజ్ఞను ధిక్కరింపరాదని నిశ్చయించి బాబడిల్లాకు సమ్మతించెను. బాబడిల్లా కొలంబస్‌ను, అతని ఇరువురుసోదరులను శృంఖలాబద్ధులగావించి, నేరస్థులనువలె, స్పైను దేశమునకు పంపివేసెను. వారు స్వదేశమును చేరుసరికి రాజును, రాణియు ఈ వృత్తాంతమునువిని, బాబడిల్లా అవివేకమునకు మిక్కిలి చింతించి, కొలంబస్‌ను, అతని సోదరులను విడిపించి, జరిగిన యవమానమునకై వారినాశ్వాసించి, మిక్కిలి గౌరవించిరి. తన అధికారము నతిక్రమించి ప్రవర్తించిన బాబడిల్లా వెనుకకు పిలిపింపబడెను. ఆతనిస్థానమున ఒవాండో (Ovando) అను మరియొక అధికారి నియమింపబడెను. అమెరికా ఖండమును పరిశోధించుటకై కొలంబస్ మరియొక పర్యా

యము ఆజ్ఞనంది సోదరుడగు బార్థొలోమియోయును, కుమారుడగు పదునాలుగేండ్ల బాలుడు ఫర్డినాండ్‌యును 1502 వ సంవత్సరమున నాల్గవపర్యాయము బయలు వెడలెను.

హిస్పానియోలా ద్వీపమున తన కింతకుపూర్వ మవమానము సంభవించుటవలన అచ్చటికి పోవుటకు కొలంబసు కెంతమాత్రమును మనస్కరింపలేదు. ఆతడు తన పడవలను నూతన మార్గమున నడపించి ఉత్తర అమెరికా ఖండమును చేరదలచెను. త్రోవలో హిస్పానియోలా ప్రాంతమున నతని పడవ యొకటి చెడిపోయెను. కాని ఆ సందర్భమున ఆ ద్వీపమును పాలించుచున్న ఒవాండో కొలంబసు యెడ మిక్కిలి క్రూరముగ ప్రవర్తించి, అచ్చట యెంతమాత్రమును నిలువ రాదని ఆతని తరిమివైచెను. కొలంబస్ ఉత్తర అమెరికాకు వెడలిపోయెను. అచ్చట చాలదినములవరకును తుపానులు చెలరేగి పరిశోధకులను చాలబాధించెను. అచ్చటి ప్రజలుకూడ తెల్లవారియెడ శత్రుత్వము వహించి, ఆహారపదార్థముల నొసంగుటకు నిరాకరించిరి. తాను చేరిన భూభాగము విశాలమైన నూతన ఖండమని కొలంబ సెరుగడు. అచ్చట కొంతకాలము గడపి ఆతడు సమీపమందలి జమైకాను చేరెను. ఇచ్చట ఆతని పడవలన్నియు పగిలిపోయెను. అనుచరులలో కొందరు కొలంబస్‌పై తిరుగుబాటుచేసి వేరొక కడుగ చీలిపోయిరి. ఆహారపదార్థములు లభింపవయ్యెను. సమీపమందలి హిస్పానియోలా ద్వీపమునుండి ఒవాండో ఎట్టి సహాయమును పంపలేదు. కొలంబస్‌ను, ఆతని అనుచరులును అచ్చట నిస్సహాయులై మరణింపవలెనని ఆతని కోరిక.

ఒవాండో బాబడిల్లాకంటెను దుష్టుడు. క్రూరత్వమున కితడు పెట్టినది పేరు. ఈతడు హిస్పానియోలా ద్వీపములోని ప్రజలను, వారి నాయకులను మాయోపాయముచే చంపించివైచెను. జమైకా ద్వీపములో అనేక కష్టములకు గురియై, ఒక సంవత్సరముతరువాత కొలంబస్ తిరిగివచ్చి హిస్పానియోలాయం దవలంబింపబడిన క్రూరవిధానమును తెలిసికొని మిక్కిలి దుఃఖించెను. నూతన ప్రదేశములందు తా ననుసరింపదలచిన నీతి ఈ విధముగ తారుమారైనందుల కాతనికి మితిలేని విచారమును, ఆశాభంగమును కల్గెను. కొలంబస్‌నకు వార్ధక్యము పైబడుచుండెను. ఆరోగ్యము చెడెను. దేహము రుజాక్రాంతమయ్యెను. ఇట్టి పరిస్థితియం దాతడు దుఃఖభారముతోడను, జరాభారముతోడను క్రుంగిపోయి 1504 వ సంవత్సరమున స్పైను దేశమునకు మరలిపోయెను.

కష్టము లొంటిగ రావు. స్పైను దేశమును చేరుసరికి తనకు చిరకాలమునుండి అండగనున్న ఇసబెల్లా రాణి మరణావస్థయందున్నట్లు కొలంబస్‌కు తెలియవచ్చెను. అశక్తతచే నాతడు రాణిని సందర్శించుటకు నోజాలడయ్యెను. కొన్ని దినములకు రాణి మరణించెను. ఫర్డినండు రాజు కొలంబస్‌నందు విశేష మభిమానముగలవాడు కాడు. హిస్పానియోలా ద్వీపమునం దన్యాయముగ తనకడనుండి తీసికొనబడిన ఆస్తి తన కిప్పింపవలసినదనియు, తన కొసంగబడిన బిరుదముల పునరుద్ధరింపవలెననియు కొలంబస్ రాజునకు మొరపెట్టుకొనెను. కాని ప్రత్యుత్తరము రాలేదు. కొన్ని దినములకు స్వయముగ రాజదర్శనము చేసినను ఆతని మనోరథము లీడేరలేదు. ఫర్డి

నాండు రాజాతనిని నిర్లక్ష్యభావముతో చూడసాగెను. తనకు జరిగిన అన్యాయములకును, ఆశాభంగములకును కొలంబసు మిక్కిలి కుందసాగెను. మనోవ్యథవలన ఆతని ఆరోగ్యము చెడిపోయి 1506 వ సంవత్సరము మే నెల ఇరువదవ తేదీని మహాధీరుడగు కొలంబస్ మరణించెను. ఆతని సమాధిపై ఫర్డినండు రాజు ల్యాటిన్ భాషయందీ వాక్యమును వ్రాయించెను—"కొలంబస్ కాస్టిల్ లియోను (Castile Leon) (స్పైను దేశము)ల కొక నూతన ప్రపంచము నొసంగెను."

కొలంబస్. స్పైను దేశమునకే కాదు, సమస్త మానవ జాతికిని గొప్ప సేవచేసిన సాహసవంతుడనుట, మహాశాలియనుట తెల్పుట అతిశయోక్తి కానేరదు.

---

## ప్రశ్నలు

1. కొలంబస్ బాల్యమునుగూర్చియు, విద్యాభ్యాసమును గూర్చియు నీకు తెలిసినయంశముల పేర్కొనుము.
2. హిందూదేశమునకు నూతనమార్గమును కనుగొనుటకై కొలంబసును ప్రోత్సహించిన అంశములేవి? భూమి స్వరూపమును గూర్చి ఆనాటి విద్వాంసుల యభిప్రాయము లెట్లుండెను?
3. తాను కావింపదలచిన గొప్పప్రయాణము విషయమున కొలంబసు ఎవ్వరిసహాయమును కోరెను? తుదకాతనికి చేయూత నొసగినవారెవ్వరు?
4. కొలంబస్ అమెరికా ఖండమునకు కావించిన మొదటి ప్రయాణమును సవిస్తరముగ వర్ణింపుము.

5. కొలంబస్ అమెరికా ఖండమునకు ఎన్ని ప్రయాణములు సల్పెను? వానియందలి విశేషముల సంగ్రహముగా తెల్పునది?

6. కొలంబస్‌కు పూర్వము అమెరికా ఖండమునకుపోయిన గొప్ప నావికులచరిత్ర నీకెంతవరకు తెలియును?

7. పూర్వకాలమున నౌకాయానము కావించుట యేలకష్టసాధ్యముగ నుండెను? ఈనాడు మనకుగల ప్రత్యేక సౌకర్యములేవి?

# 2. ఉత్తరధ్రువ పరిశోధనము

భూగోళమండలి ఉత్తరతను ప్రాంతమునకు ఆర్క్టిక్ (Arctic) మండలమని పేరు. ఆ మండలము 66½° ఉత్తర అక్షాంశ రేఖనుండి ప్రారంభమై ఉత్తర ధ్రువమువరకును వ్యాపించియుండును. దీని నతిశీతల మండలమనియు, ఆర్క్టిక్ మండలమనియుకూడ పిలుచుచున్నారు. ఈ ప్రదేశము లందలి సముద్రమునకు ఆర్క్టిక్ సముద్రమని పేరు. శీతలాధిక్యమువలన నిచ్చటి నీరంతయు గడ్డకట్టిపోవును. కాని వేసవికాలము ప్రారంభమైన వెనుక మంచు కొంచెము కొంచెముగ కరగును. సముద్రముపై కప్పియున్న మంచుపలకలు అచ్చటచ్చట పగిలి నీరు వెలువడును. ఇట్టి సముద్రమునందు ఎంతటి బలమైన యోడలును ప్రయాణముచేసి సురక్షితముగ బయటపడుట దుస్సాధ్యము. దుర్గంధ్యముగు నీ సముద్రమధ్యమున నుత్తరధ్రువము నెలకొనియున్నది. అత్యంత శీతలమగు నీ ప్రదేశములందు చెట్లుచేమలు వృద్ధిచెందనేరవు. ధ్రువప్రాంతములను సమీపించినకొలదియు, గడ్డికూడ కానరాదు. ఇచ్చట మనుష్యుని కావశ్యకమగు పైరుపంటలను పండించుట కెంతమాత్రమును అవకాశము లేదు. కావుననే ఇచ్చట నాగరకజనులెవ్వరును నివసించుటలేదు. ఇట్టి ప్రదేశముల పరిశోధించుట సామాన్యజనుల దృష్టియందు నిరర్థక వ్యాపారము. కాని కొందరు సాహసు లీ ప్రదేశములను చేరుటకుకూడ యత్నించిరి. వీరిలో ముగ్గురనుగూర్చి మనము

తెలిసికొందము. అందు విలియం బారంట్స్ (William Barents) అను హాలండు (Holland) దేశస్థుడు పదునారవ శతాబ్ది తుది భాగమునందును, ఫ్రిడ్ట్జాఫ్ నాన్సన్ (Fridtjof Nansen) అను నార్వే (Norway) దేశీయుడు పందొమ్మిదవ శతాబ్దియందును, రాబర్ట్ ఎడ్విన్ పియరీ (Robert Edwin Peary) అను అమెరికా దేశ వాసి ఇరువదవ శతాబ్దియందును, ప్రమాదభూయిష్టమైన ఆర్కిటిక్ సముద్రమునందు ప్రయాణము సల్పిరి. వీరిలో మొదటివాడగు బారంట్స్ ఆర్కిటిక్ సముద్రమునందు కొంత భాగమునుమాత్రము పరిశోధించెను. నాన్సన్ అనునాతడు ఉత్తరధ్రువప్రాంతములకు ప్రయాణము చేసి, తత్ప్రదేశముల చేరెను. కాని, ధ్రువమునుమాత్రము చేరలేదు. ఉత్తరధ్రువమనునది యొక బిందువుమాత్రమని మన మెరుంగవలయును. కాని రాబర్ట్ ఎడ్విన్ పియరీ అను అమెరికా నౌకాయోగి సూటిగ ఉత్తరధ్రువము దిక్కునకు ప్రయాణముచేసి దానిని చేరగల్గెను. బారంట్స్ అనువాడు పూర్వదేశములకు మార్గము కనుగొనవలయునను ఉద్దేశముతోడను, నాన్సన్ పియరీలు కేవల పరిశోధకదృష్టితోడను తమ సాహసప్రయత్నములకు పూనుకొనిరి.

భరతఖండము మున్నగు ప్రాగ్దేశము లపార ధన సంపన్నములై నవనియు, వానితో వ్యాపారము సాగించిన పక్షమున మిక్కిలి శీఘ్రకాలములో గొప్ప యైశ్వర్యమును సంపాదింప వచ్చుననియు పాశ్చాత్యులు చిరకాలమునుండియు నమ్మియుండిరి. పదునేనవ శతాబ్ది తుదిభాగమున పోర్చుగీసు వారును, పదునారవ శతాబ్దియందు స్పైను దేశీయులును

తూర్పు పశ్చిమదిక్కులకు ప్రయాణముచేసి పూర్వదేశము లకు సముద్రమార్గమును కనుగొనిరి. ఆయామార్గములననుసరించి వారు తమ వర్తకమును సాగించుచుండుటయే కాక, వాని ననుసరించుటకు తమకుమాత్రమే హక్కుగలదనియు, ఇతరులందు ప్రవేశింపరాదనియు తలంచుచుండిరి. హాలెండు దేశము వారికీనూతనమార్గ పరిశోధనమునందు దనకొఱవము లభింపలేదు. కావున వారివ్యాపారము కుంటువడెను. పూర్వ దేశములకు పోవుటకై మరియొక మార్గమును కనుగొన వలెనని వారు తొందరపడసాగిరి. హాలండుదేశము పరిమాణ మందు కుక్కిలించిన్నది. కాని ఇచ్చటి ప్రజలు గొప్పవీరులు; సాహసవంతులు; పట్టుదలకలవారు. నౌకాయానమునందు వీరి దండెవేసినచేయి. కావున పదునారవ శతాబ్దిమధ్యభాగ మందు వీరు తమ నావికుల కొందరనుపంపి రష్యా (Russia) దేశమునుదాటి భూమియొక్క ఉత్తరాగ్రమునుచేరి అచ్చటి నుండి దక్షిణ దిక్కుగ క్రిందికి దిగివచ్చి శాంతమహాసముద్ర మును ప్రవేశించుటకు మార్గమును పరిశోధింపవలసినదని ప్రోత్సహించిరి. ఈ సాహసకార్యమునకు పూనుకొనినవాడు విలియంబారంట్స్ అనువాడు. 1598వ సంవత్సరమునకు పూర్వము రెండు పర్యాయములాతడు పై ప్రయత్నమునుచేసి నోవాజెంబ్లా (Nova Zembla) అనుదీవుల వరకు మాత్రము ప్రయాణముచేసి, విఫలమనోరథుడై వెనుకకు మరలివచ్చెను. 1598 వ సంవత్సరమున హాలండు దేశములోని ధనాఢ్యులగు కొందరు వర్తకులు విలియంబారంట్స్‌ను ప్రోత్సహించి, తూర్పు దేశములకు నూతనమార్గమును కనుగొనుటకై మరి

గయొక ప్రయత్నమును చేయవలసినదని కోరిరి. ఈ ప్రయాణమును చేయుటకై రెండుఓడలు సిద్ధము చేయబడెను. శారంట్స్ వీనికి మార్గదర్శకుడు. ధ్రువప్రాంతములలో నివరకే ప్రయాణముకావించి చాల అనుభవమును సంపాదించినందున ఈతడిందుల కెంతయును తగియుండెను. ఉత్తరయాత్ర చిరకాలము పట్టునని ఆతనికి తెలియును. కావున ఆతడు అవివాహితులును, బలాఢ్యులును, కష్టసహిష్ణువులు నగువారిని ప్రత్యేకముగ ఏరి, తన యోడలలో నావికులుగ చేర్చుకొనెను. ఆలుబిడ్డలకొరకై బెంగగొనువా రిట్టి సాహస ప్రయత్నములో కాలుపెట్టరాదని ఆతని యభిప్రాయము.

ఈ ఉత్తర ప్రదేశములకుపోవుటకనువైన కాలము వేసవి యొక్కటియే. కావున శారెంట్స్ మొదలైనవారు మే నెలయందు స్వదేశమునుండి బయలు వెడలి ఉత్తరాభిముఖముగ ప్రయాణముచేసి ఉత్తరాగ్రము (North Cape) అను ప్రదేశమును చేరిరి. ఆర్కిటిక్ సముద్రమున కిదియే ప్రారంభము. ఉత్తరమునకు పోవునకొలదియు దినప్రమాణము హెచ్చసాగెను. రాత్రి ప్రమాణము తగ్గెను. జూను ఒకటవ తేదీనాడు సూర్యుడస్తమింపనేలేదు. సూర్యబింబ మాకాశమున దిగువభాగమందే చుట్టును తిరుగసాగెను. ఈ విధముగ అనేక దినములవరకును సంభవించెను. ఆర్కిటిక్ సముద్రమును ప్రవేశించిన స్వల్పకాలముననే వారికి మంచుతునకలు కాన్పింపసాగెను. దూరమునుండి అవ్వి హంసలవలె కానవచ్చెను. కాని అనతికాలములో వారిభ్రమ దూరమయ్యెను. సముద్రముపై మంచుపొరలు దట్టము కాసాగెను. ఎండ వేడిమి

వలన ఆ హిమాచ్ఛాదన మచ్చుటచ్చుట పగిలి నడుమ పెద్ద పెద్ద త్రోవలేర్పడుచుండెను. ఈ సందులలో నుండి బారెంట్స్ మున్నగువారు తమ యోడలను నడపించుచు ముందునకు పోసాగిరి. కొన్నిదినములపాటు ఈవిధముగ మంచు దారులలో పయనముచేసి ఓడలు "స్పిట్స్‌బర్గెన్" (Spits bergen) అను ద్వీపమునుచేరి అచ్చట లంగరువేసెను. ఈ ప్రాంతములలో మిక్కిలి బలముగల తెల్లని ఎలుగుబంట్లు విస్తారముగ నివసించును. ఇవి మిక్కిలి వేగముగ మూడు నాల్గుమైళ్ళ వరకును సముద్రములో సునాయాసముగ ఈదగలవు. ఆ జంతువు తన పాదముతో సామాన్యమైన చిన్న పడవలను పడగొట్టగలదు. ఇట్టి ఎలుగుల కొన్నిటిని సంహరించిరి. స్పిట్స్‌బర్గెన్ ద్వీపమునుండి ముందునకు పోవుటకు త్రోవ లేదు. సముద్రమంతయు మంచుచే కప్పబడియుండెను. కావున పరిశోధకులు కొంతవరకు వెనుకకు మరలివచ్చిరి. అచ్చటినుండి రెండు ఓడలును వేరు వేరు మార్గముల నవలంబించి ముందునకు సాగిపోయెను. బారెంట్స్ తూర్పుదిక్కుగ ప్రయాణముచేసి నోవాజెంబ్లా అనుద్వీపమును చేరగల్గెను. ఆత డతిక్రమించిన సముద్రమునకు బారెంట్స్ సముద్రమని పేరు. ఇచ్చటకు చేరుసరికి మంచుతెరలు మరింత దట్టముగ పడవలు ముందునకు సాగిపోవుటయే దుస్సాధ్యమయ్యెను. కాని బారెంట్స్ మిక్కిలి నేర్పుతో ఓడకెట్టి అపాయముగాని, హానికాని కలుగకుండ నడపించి ద్వీపమునకు ఉత్తర ప్రాంతముల చేరెను. ఓడ అచ్చట నిలచియుండగనే తీవ్రమైన గాలులు వీచుట ప్రారంభించెను. మంచుతెరలు ఓడనన్నివైపుల

చుట్టుకొని నొక్కివేయసాగెను. ఆయొత్తిడికి ఓడ చుక్కాని విరిగిపోయెను. ఓడకు సంబంధించిన యొకచిన్నపడవ తునకలు తునకలుగ విరిగిపోయెను. ఆ మరునాడు తుపాను శాంతించి సందున పరిశోధకులు మరికొంత దూరము ముందునకేగి ఆపైన పోవుటకు సాధ్యముకాదని వెనుకకు మరలిరి. కాని అప్పటికే వేసవికాలము ముగిసినందున సముద్రమంతయు మరల ఘనీభావము నొందసాగెను. కొందరునావికులు సముద్రములోనికిదిగి మంచుగడ్డలను తెగగొట్టి పడవపోవుటకై మార్గమును చేయసాగిరి. ఒకసందర్భమున ఓడ గాలితాకిడిచే దూరముగ పరుగెత్తుసరికి నావికులు సముద్రమధ్యమున మంచు తెరలపై నిలువబడి పోయిరి. అప్పటనే తమకు మరణము వ్రాసియున్నది కాబోలునని వారు భయపడసాగిరి. కాని మరికొన్ని నిమిషములలో గాలివాలువలన పడవ వారిని సమీపింపగా నావికులు దానిలోని కెగబ్రాకి ప్రాణముల కాపాడుకొనగల్గిరి. ఆసతి కాలములో చలి హెచ్చెను. మంచు పలకలు కుప్పలు తిప్పలుగా కొట్టుకొని రాసాగెను. ఓడకు నలుదిక్కులను హిమవారాశి యేర్పడి దానిని నాలుగైదడుగుల ఎత్తునకు ఎగదన్నెను. అప్పుడప్పుడే మంచుపలకలు భయంకర శబ్దముతో పగిలిపోవుచుండెడివి. చుట్టునుచేరియున్న మంచుగడ్డల యొత్తిడిచే ఓడపగిలిపోవునని యెప్పటికప్పుడు నావికులు భయపడసాగిరి. ఇట్టి పరిస్థితులలో వెనుకకుమరలి రాగల్గుటకు ఇక అసాధ్యము. కావున నావికులు సముద్రపు ఒడ్డుననే తాత్కాలికముగ నొకయింటిని నిర్మించుకొని చలికాలము వచ్చుట గడపుటకు నిశ్చయించిరి. ఈ

ప్రదేశమునకు "హిమధామము" (Ice haven) అని పేరు.

గృహనిర్మాణమున కావశ్యకమగు కట్టె మొదలగు నవి నోవా జెంబ్లా ద్వీపమున లభింపవు. కాని దక్షిణప్రాంతములనుండి కొన్ని వృక్షములు కొట్టుకొనివచ్చి అచ్చటపడి యుండెను. నావికులు వాని నతిసంతోషముతో జాగ్రత్త పరచి కొంతకట్టెను గృహనిర్మాణమునకును, మరికొంత వంటచెరకుగాను ఉపయోగించిరి. దుర్భరశైత్యము వలన దేశ యందెంతటి సహనము కలవారికినికూడ పనిచేయుట దుస్సాధ్యముగనుండెను. పనిచేయునప్పుడు వడ్రంగులు మేకులను నోటిలో బెట్టుకొనిన పక్షమున పెదవులును, నాలుకయు కొయ్యబారి పోయెడివి. ఒకనాడు నావికులలో కొందరొక ఎలుగు గొడ్డును వేటాడుచుండిరి. దెబ్బతినిన యా మృగము కోపావేశముచే తన వెనుకకాళ్ళపై నిలువబడి వేటగాండ్రను చంపవలెనని యుద్దేశించెను. కాని శీతలాధిక్యతచే నది నిలువున కొయ్యబారి ప్రాణములవిడచెను. చలివలన పలువురు రోగగ్రస్తులైరి. కొందరు మరణించిరి. భూమి త్రవ్వుటకు సాధ్యముకాక మిక్కిలి కఠినముగ నున్నందున నావికులు మృతదేహములపై రాళ్ళనుమాత్రము పేర్చి సమాధిని కల్పించెడివారు. అతికష్టముమీద వారు తాత్కాలికముగ నొక యింటిని నిర్మించుకొనిరి. దానికి తలుపులేకాని కిటికీలు లేవు. పైభాగమున పొగపోవుటకై యొకగొట్టమును మాత్రము ఏర్పాటుచేసిరి. ఇందులోనే నావికులు, వారి వస్తుసామగ్రిని భద్రముకావించుకొని, వంటలు చేసికొని, రాత్రియందు నిద్రించుచుండిరి. రోగులకుకూడ నిదియే నివాసస్థానము. దిన

ములు గడచినకొలదియు దినప్రమాణము తగ్గిపోయి రాత్రులు మిక్కిలి దీర్ఘములు కానారంభించెను. నవంబరు నెలనుండి జనవరి తుదివరకును సూర్యోదయమే కాలేదు. వెలుతురు కొరకై వారు ఎలుగుగొడ్డు క్రొవ్వుతో దీపములను వెలిగించు కొనుచుండిరి. చలిగాలులు తమయింటిలోనికి రాకుండుటకై వారు పడవ తెరచాపలనింటికప్పుపై పరచెడివారు. ఈ కష్టము లిట్లుండగా వారికాహారపు కొరతసంభవించెను. ఆప్రాంతము లందు తెల్లని నక్కలు విస్తారముగ కానవచ్చెడివి. నావికులు వానిని పట్టుకొనుటకై వలలనుపన్ని చేజిక్కినవానిని చంపి వానిమాంసము నాహారముగను, పైచర్మమును వెచ్చని టోపీలు చేయుటకును, వాడుచుండిరి. మంచును కరగించిన కాని వారికి నీరులభించెడిదికాదు. చలికాలము ముదిరిన కొలదియు మంచుతుపానులు చెలరేగసాగెను. అతితీవ్రమైన యా గాలిలో ఊపిరిపీల్చుటకుగూడ సాధ్యము కాకుండెను. ఇంటిలోనుండి బయటకు వెడలుట దుస్తరమయ్యెను. కాని ఆహారసంపాదనమునకును, తనుతోడను సంరక్షించుకొను టకును వారప్పుడప్పుడు యిలువెడలక తప్పెడిదికాదు. చలివలన వారిపాదరక్షలుకూడ కొయ్యబారెడివి. ఒకనాడు వారిలో కొందరు తమవస్త్రములను తడిపి ఆరవేయుటకై వానిని నిప్పుదగ్గరకు తీసుకొని పోవుసరికి అవికూడ కట్టెవలె మారి పోయెను.

నావికులు నివసించుచుండిన యింటికి కిటికీలులేవని తెల్పియున్నాము. చలిబాధనుండి తప్పించుకొనుటకై తలు పులుమూసిన పక్షమున ఇల్లంతయు పొగతోనిండిపోయి వా

రక్కిరి బిక్కిరి యగుచుండిరి. తలుపులు తెరవగానే చలిగాలి అతి తీవ్రముగ లోనికి ప్రవేశించుటయే కాక మంచుపొరతో క్షణకాలములో నిల్లంతయు నిండిపోవుచుండెను. కొన్నిసమయములయందీ మంచును త్రవ్వి మెట్లుగాచేసికొని, నావికులు తమగృహమునుండి, భూగర్భములోనుండివలె, బయలువెడలుచుండిరి. చలిబాధను బాపుకొనుటకై నిప్పునకు మిక్కిలి చేరువగా కూర్చుండినప్పుడు కొన్నిసందర్భములలో వారి బట్టలు కాలుచుండెడివి. కాని బట్టలుకాలుచున్న వాసనవలననేకాని వారికావిషయము తెలియవచ్చెడిదికాదు. నిలువయుండిని మాంసమునే యెల్లప్పుడును తినుచుండుట వలన వారికనారోగ్యము సంభవింపసాగెను. కీళ్ళనొప్పులవలన పలువురు బాధపడసాగిరి. వారితో నివసించుచుండిన ఎస్కిమోలు స్నానముచేయుటయే దీనికి చికిత్సయని నిర్ణయించిరి. వారి వద్దనున్న పెద్ద పీపాలలో నొకదానిని నీటితోనింపి దానియందు నావికులుకూర్చుండెడి వారు. ఈ విధానముచే కీళ్ళనొప్పులుపశమించెడివి. కాని మొత్తముమీద నావికులందరును చిక్కి, బలహీనులై పోయిరి.

జనవరినెల సమాప్తమైన తరువాత క్రమక్రమముగా సూర్యరశ్మి కానరాసాగెను. లోకబాంధవుని దర్శనము నావికుల కానందముదయించెను. కాని యుండలి దుఃఖ మునుమరి కి చాలదినములుపట్టెను. గాలి తీవ్రముగ వీచినప్పుడు సముద్రపునీటిని కప్పినమంచు తెరలు దూరముగ తొలగిపోవుచుండెడివి. అట్టి సందర్భములలో తమ ప్రయాణమున కనుకూలసమయము వచ్చినదని నావికులాశపడెడివారు. కానిమరునటి

దినమున గాలివాలుచే మరల మంచుపలకలు నీటిని కప్పి వేయుసరికి వారు నిరుత్సాహము చెందుచుండిరి. ఇంతకాలము వారిపడవ మంచులో పాతుకొనిపోయియుండెను. దాని చుట్టును మంచు సీసమువలె బిగిసిపోయెను. ఎన్నివిధముల ప్రయత్నించినను ఓడను కదుపుటకుకూడ సాధ్యము కాలేదు. ఆ మంచుసముద్రములో నిస్సహాయముగ మరణింపవలయునేమోయని నావికులకు భయముకల్గెను. కావునవారు నాయకుడగు బారెంట్సును సమీపించి తమవద్దనున్న రెండు చిన్నపడవలలో ప్రయాణముచేసి స్వదేశమునకు మరలిపోవుటకనుజ్ఞ నొసంగవలసినదని కోరిరి. ఆచిన్న పడవలు చాలవరకు చెడిపోయి యుండెను. అట్టి నావలలో సముద్రముపై ప్రయాణముచేయుట మిక్కిలి అపాయకరము. కాని మార్గాంతరములేక బారెంట్స వారికనుమతి నొసంగెను. చాలదినములు కష్టపడి నావికులు తమ పడవలను బాగుచేసి నీటికడ కీడ్చుకొనిపోయిరి. స్లెడ్జిబండ్లలో వారి వస్తుసామగ్రియంతయు పడవలలో చేర్పబడెను.

హిమధామమునుండి బయలువెడలుటకు పూర్వము బారెంట్స తన గాథనంతను తెల్పుచు, తమ యోడ మంచులో పాతుకొనిపోవుటవలన ప్రయాణముచేయుటకేదియు సాధనము లేకుండెననియు, అందువలన ప్రాణరక్షణమునకై తాము చిన్న నావలలో స్వదేశమునకు మరలిపోవుటకై సమకట్టితిమనియు వ్రాసి, ఆ యుత్తరమును తుపాకి మందు నింపెడి యొక గొట్టములో భద్రపరచి తన యింటి యందు విడచిపోయెను. సుమారు మూడునూర్ల సంవత్సర

ములు గడచిన వెనుక నొక ఆంగ్లేయుఁడు హిందూస్థానమునకు పోయినప్పుడు బారెంట్స్ వ్రాసిన జాబు అతనికి లభించెను. బారెంట్స్‌ను అతని మిత్రుఁడొకఁడును చాల దినములనుండి అస్వస్థతగ నుండిరి. వారిని తీసికొని నావికులు జూను నెల యందు తమ ప్రయాణము నారంభించిరి. అనేక పర్యాయములు వారి స్థితి మిక్కిలి ప్రమాదకరముగ పరిణమించెను. వారు ప్రయాణముచేయుచున్న నావలు మంచుగడ్డల తాఁకిడికి తాళజాలకపోయెడివి. అట్టి సందర్భములందు నావికులు పడవలను గట్టుపైకి లాగి కాపాడుకొనుచుండిరి. ఈ విధముగ కొన్ని దినములు గడచిన వెనుక రోగగ్రస్తుఁడైయున్న బారెంట్స్ మరణించెను. ఆతని మృతికై నావికులందరును మిక్కిలి చింతించిరి. ఆతఁడు మిక్కిలి సమర్థుఁడగు నావికుఁడేగాక వారి కందరకును ఇష్టుఁడైన నాయకుఁడు. బారెంట్స్ మరణమువలన నావికుల కష్టములు మరింత హెచ్చెను. వారికి మార్గదర్శకుఁడుగనుండు సమర్థుఁడు కరవయ్యెను. కాని ప్రయాణము సాగిపోయెను. కొన్ని ప్రదేశములలో మంచుతెరలు వారి మార్గమును సంపూర్ణముగ కప్పివేసినప్పుడు నావికులు తమ పడవల నొడ్డునకులాగి, మెట్టపై కొంతదూరము వానిని లాగుకొనిపోయి అనువైనచోట మరల నీటిలోనికి త్రోయుచుండెడివారు. ఐదువారము లీవిధముగ మిక్కిలి కష్టముపడి సాగిపోయినతరువాత మంచుసముద్రము సమాప్తమై జలవారాశి కాన్పించెను. జూలై నెలయందు వారికి కొందఱు రష్యాదేశపు పల్లెవాండ్రు కానవచ్చిరి. ఒక సంవత్సరముతరువాత మానవ ప్రపంచము మరల కానవచ్చినందులకు వారు చాల సంత

సించిరి. కాని వారి కింతలో ఆహారపుకొరత సంభవించెను. దినమునకు రెండుఔన్సుల ఆహారముతో కాలక్షేపము చేయ వలసివచ్చెను. ఎన్ని కష్టములు సంభవించినను తుదకు వారు సురక్షితముగ స్వదేశమును చేరగల్గిరి. రష్యాదేశము నకు సమీపమున నా దేశపు యోడలో కొంతకాలమును, ఆపైన హాలెండు దేశపు టోడయందును వారు క్షేమముగ పోగల్గిరి. కాని, 1,600 మైళ్ళ దుస్తరసముద్రమును చిన్న నావలలో గడచివచ్చిన వెనుక వారికి సహాయము లభించెను. ఈ నావికులు సజీవులై తిరిగివచ్చినందులకు హాలెండు దేశము వారు సంతసించిరి. కాని ధీరుడైన బారెంట్స్ మరణమున కెల్లవారును విచారించిరి.

ఆర్కిటిక్ సముద్రమునందు ప్రయాణముచేసి ఉత్తర ధ్రువ ప్రాంతములవరకును పోయి అనేక వైజ్ఞానిక విషయ ముల కనుగొని కీర్తిగాంచినవారిలో ఫ్రిడ్జాఫ్ నాన్సన్ అను పరిశోధకుడు ప్రముఖుడు. ఈతడు నార్వే దేశమందలి ఆస్లో (Oslo) పట్టణమున 1861 వ సంవత్సరమున జన్మించెను. ఈతడు బాల్యమునుండియు మిక్కిలి బలశాలి. ధైర్యోత్సా హములు, పట్టుదలయు గలవాడు; కష్టసహిష్ణువు; మంచి ఉపాయశాలి. నాన్సన్ కు చిన్నతనమునుండియు సాహసకృత్య ములు కావించినవారి జీవితగాథలను చదువుటయందు చాల అభిరుచి. విద్యార్థిదశయందే ఆత డాంగ్లభాషను నేర్చుకొని సర్ జాన్ ఫ్రాంక్లిన్ (Sir John Franklin) మొదలైన పరి శోధకుల జీవితముల చదువుచుండెడివాడు. ఫ్రాంక్లిన్ అను నాతడు కనడా (Canada) దేశమును వాయువ్యదిశనుండి చుట్టి

వచ్చుటకై ప్రయత్నించి, తన ప్రాణముల గోల్పోయెను. ధీరులైన యిట్టి పరిశోధకులయెడల ఆతని కఖండ గౌరవముండెడిది. కళాశాలయం దీతడు భూగర్భశాస్త్రమును, జీవశాస్త్రమును అభిమాన విషయములుగ గైకొని విద్యాభ్యాసము చేసెను. నాన్సన్ కు చిన్నతనమునుండియు సముద్రయానము నందును, సముద్రజీవితమునందును చాల యిష్టము. నాన్సన తన యిరువదియొకటవ సంవత్సరమున "వైకింగ్" (Viking) అను ఓడలో ఒక ప్రయాణీకునిగ చేరి ఉత్తర సముద్రములను జూచివచ్చెను. ఈ ప్రయాణమువలన నాన్సన్ కు ఆర్క్టిక్ మండలమందలి సముద్రమును చూచుటకును, అచ్చటి పరిస్థితుల గమనించుటకును చక్కని అవకాశము లభించెను. ఇచ్చటి కష్టనిష్ఠురములుకూడ ఆతనికి చక్కగ తెలియవచ్చెను. ఆర్క్టిక్ సముద్రమునందలి అపాయముల గుర్తించిన వెనుక ఆ యపూర్వభూముల మరల సందర్శింపవలయునను తీవ్రమగు కోర్కె నాన్సన్ కు కలిగెను. 1888 వ సంవత్సరమున నాన్సన్ కొందరు మిత్రులతో కలసి గ్రీన్ లాండ్ (Greenland) ద్వీపమును సందర్శించెను. ఇది ఉత్తర అమెరికాకు ఈశాన్య భాగమునందు గలదు. ఇందు చాలభాగము శీతలమండలములో నుండును. భూమి నిరంతరము మంచుతో నిండియుండును. ఇచ్చటి ప్రజలు ఎస్కిమో (Eskimos) లను అనాగరక జనులు. నాన్సన్ ను, అతని మిత్రులును ఇచ్చట పదినెలల పాటు నివసించి, ఇచ్చటి స్థితిగతులను పరీక్షించుటయేగాక స్థానికులగు ఎస్కిమో ప్రజలతో స్నేహమును సంపాదించిరి. 1889 వ సంవత్సరము వేసవియందు పరిశోధకులు గ్రీన్ లాండ్

నుండి స్వదేశమునకు మరలివచ్చిరి.

గ్రీన్‌లాండ్ యాత్రను ముగించుకొని మరలి వచ్చు సరికి నాన్సన్ వయస్సు ఇరువదియేడు సంవత్సరములు. అప్పటికే ఈతనికీర్తి నలుదిక్కుల వ్యాపించెను. ఆర్కిటిక్ సముద్రమునందు విహారము కావించుటయం దీతనికిగల సామర్థ్య మెల్లవారికిని తెలిసివచ్చెను. కావున ఈతని యాజమాన్యమున నుత్తరధ్రువమును కనుగొనుటకై యొక పరిశోధక వర్గమును పంపవలయునని కొందరు నార్వే దేశీయులు ఆలోచింపసాగిరి. నాన్సన్ కూడ ఇట్టి ప్రయత్నమును చేయవలయునని కొంతకాలమునుండి చింతించుచుండెను. అంతకుపూర్వ మెవ్వరునుకూడ 83½° ఉత్తర తులాంశరేఖనుదాటి ముందుసకుపోవలేదు. అచ్చటి ప్రదేశములలో నెట్టి స్థితిగతులుండునోకూడ యెవ్వరికిని తెలియరాదు. అయినను తాను కావించిన పరిశీలనవలనను, సంపాదించిన యనుభవమువలనను నాన్సన్ ధ్రువప్రదేశములకు చేరుటకై యొక అపూర్వపథకమును సిద్ధపరచెను. ఆర్కిటిక్ సముద్రములోనికి సామాన్యమైన పడవలు పోగల్గుట అసంభవము. అచ్చటి మంచుకొండల యొత్తిడికి ఎంతటి బలమైన యోడలును తాళజాలవు. కాని ప్రత్యేకమగు ఆకారముతో నిర్మింపబడిన యోడ ఆ మంచుసముద్రమునందు తేరచాప ఒక పర్యాయమైన ఎత్తకుండ ధ్రువప్రాంతమును చేరగలదని నాన్సన్ నిశ్చయించెను. ఇందుల కాతనికి ప్రబలమైన ఆధారములుకలవు. మధ్య ఆసియాయందు పెరుగునట్టి కొన్ని వృక్షములు సైబీరియా దేశములోని నదులలోపడి కొట్టుకొని

వచ్చి ఆర్కిటిక్ సముద్రమును చేరును. అచ్చటి మంచుదిబ్బ లలో యిట్టి వృక్షములు కొన్ని చిక్కుకొనుట తటస్థించి నప్పుడవి నెమ్మదిగ కదలుచు పశ్చిమాభిముఖముగ కొట్టుకొని పోయి సుమారు రెండు వేలమైళ్ల దూరమునకు వెడలి, స్పిట్స్‌బర్జెన్ దీవులలో కాని, గ్రీన్‌లాండునందు కాని ఒడ్డును చేరుచుండును. ఈ సుదీర్ఘ ప్రయాణము కావించిన వృక్ష జాలము ఉత్తరధ్రువముపైనుండియో, లేక తత్సమీపము నుండియో గడచి యుండవలయును. పై యంశములను చక్కగ గమనించినయెడల తూర్పుదిశనుండి పశ్చిమదిక్కుగ నౌకప్రవాహ ముత్తరధ్రువముపైనుండి నిరంతరము సాగు చుండునని తేలుచున్నది. ఇట్టిప్రవాహము నుపయోగించు కొని ఉత్తరధ్రువప్రాంతమును చేరుటకై ప్రయత్నించినది జీనెట్ (Jeannette) అను ఒక అమెరికా నౌకమాత్రమే. ఆనావికులు బేరింగ్ జలసంధి (Bering Strait) దాటి, ఉత్తర ధ్రువమును చేరుటకై సాధ్యపడు నేమోయని యత్నించి యుండిరి. కాని ఈ యోడ ఆర్కిటిక్ సముద్రమునందలి మంచులో పాతుకొనిపోయి తుదకుభగ్నమయ్యెను (1881). ఈ యోడలో ప్రయాణముచేసిన వారిలో పలువురుమరణించిరి. మెల్‌విల్ (Melville) అనునాతని నాయకత్వమున కొందరు ప్రాణముల దక్కించుకొని బయటపడిరి. 1885 వ సంవత్సరమున మెల్‌విల్ జీనెట్ ఓడప్రయాణమునందు తాను సంపాదించిన అనుభవములను వర్ణించుచు నొకగ్రంథ మును ప్రకటించెను. తమయోడ మంచుకొండలలో చిక్కు కొని, నాశనము కాకుండియుండినయెడల తూర్పుదిశనుండి

పశ్చిమాభిముఖముగ ప్రయాణముచేసి అమెరికా దేశమును చేరియుండునని ఆతడు తెల్పెను. కాని ఎట్టిపడవనైనను మంచుకొండలు, అడకత్తెరలో పోకనువలె, భగ్నముకావించు ననికూడ ఆతడు అభిప్రాయపడెను. కాని ఈయభిప్రాయముతో నాన్సన్ ఏకీభవింపలేదు. జీనెట్ ఓడకు సంబంధించిన కొన్ని కాగితములును, ఆ పడవలో ఒకరికిచెందిన చర్మపు పాద కవచమును గ్రీన్‌లాండ్ ద్వీపమునందలి నైఋతి భాగమును చేరియుండుట నాన్సన్‌కు తెలియవచ్చెను. ఈ విధముగ కాగితములు 2900 మైళ్ల సముద్రమునుదాటి రాగల్గెను. ఇంతటి దూరమును కాగితములే దాటివచ్చినప్పుడు పడవలుకూడ ఆవిధముగ చేయుటగూల సాధ్యపడదని నాన్సన్ వాదించెను. జీనెట్ ఓడలోని ఈ వస్తువులు సగటున దినమునకు రెండు మైళ్లచొప్పున ప్రయాణముచేసి యుండును. కావున ఆర్క్‌టిక్ సముద్రమును గడచివచ్చుటకై సుమారు నాల్గుసంవత్సరముల కాలము పట్టునని నాన్సన్ అంచనావేసెను. ఆర్క్‌టిక్ సముద్రములో ప్రయాణముచేయుటకై ప్రత్యేకమగు నొక యోడను నిర్మింపవలయునని నాన్సన్ నిశ్చయించెను. ఆ యోడ మంచుకొండల ఒత్తిడికి చెడిపోక వానినడుమ నుండి జారిపోవునట్లుండవలయును. ఆ యోడయందు పన్రెండుగురు జనులను మాత్రముతీసికొని పోవుటకును, వారి కైదు సంవత్సరములవరకును సరిపోయెడి ఆహారపదార్థములను పడవలో నింపికొనిపోవునట్లును ఆతడు స్థిరపరచుకొనెను. జీనెట్ ఓడ సైబీరియా దేశమునకుత్తర తీరమునందుగల "న్యూసైబీరియాదీవు" (New Siberian Islands)ల

సమీపమున మునిగిపోయి యుండెను. ఉత్తరరష్యా సైబీరియా దేశములదాటి ఆ ద్వీపముల చేరవలయునని నాన్సన్ నిర్ణయము. ఈ ప్రయాణముచాలకాలము పట్టును. కావున ఈ వ్యవధియందు ఆర్కిటిక్ సముద్రమును శాస్త్రీయ దృష్టిచే పరిశీలించి నూతన విజ్ఞానమును సంపాదించుట కవకాశము లభించును. ఏ కారణమువల్లనైన ఓడ చెడిపోవుట సంభవించిన పక్షమున తానును, మిత్రులును, మంచు గడ్డలపై నడచుచు, అవసరమున్న ప్రదేశములందు కాయక్ (Kayak) అనుతోలు డింగీలలో ప్రయాణముచేసి స్పిట్స్‌బెర్జెన్ ద్వీపమును కాని, నోవాజెంబ్లా ద్వీపమునుగాని చేరవచ్చును. ఈ యత్నమందు ఉత్తరధ్రువమును చేరకపోయినను ఎట్టి నష్టమునులేదు. అపారమును, అవిజ్ఞాతమునగు ఆర్కిటిక్ సముద్రమునుగూర్చిన అనేక నూతనాంశముల తెలిసికొనుట కవకాశము లభించిన చాలునని నాన్సను తలంచెను.

ఈ యపూర్వ ప్రయత్నమును సాధించుటకై నార్వే దేశపురాజును, ఆ దేశపు ధనికులును నాన్సన్‌కు చాల ధనసహాయము కావించిరి. బ్రిటను దేశమందలి రాయల్ జాగ్రాఫికల్ సొసైటీ (Royal Geographical Society) వారు నాన్సన్‌కు 300 పౌనులను విరాళముగా నొసంగిరి. కాని ఆ దేశమునందలి పరిశోధకులును, శాస్త్రజ్ఞులును నాన్సన్ కావించిన సిద్ధాంతము నిరాధారమైనదనియు, ఉత్తరధ్రువమున నొకవైపునుండి వేరొకవైపున కెట్టి ప్రవాహమును లేదనియు, ఇట్టి ప్రయత్నములు కావించిన ఇతర నౌకలకు

సంభవించిన దుస్థితియే నాన్సన్ ఓడకుకూడ సంభవింపగల దనియు వాదించిరి. 1881-84 సంవత్సరముల నడుమ ఉత్తర సముద్రములందు పరిశోధనము గావించి ప్రఖ్యాతిని వడసిన జనరల్ గ్రీలీ (General Greely) అనునాతడు నాన్సన్ సిద్ధాంతమును సంపూర్ణముగ ఖండించుచు ఉపన్యసించెను. నాన్సన్ ఈ విమర్శనల నన్నిటిని శాంతముగ విని "మీ యభిప్రాయము లను నాకు తెలియజేసినందులకు చాల కృతజ్ఞుడను. కాని నా ప్రయత్నము మాత్రము సాగితీరును" అని చిరునగవుతో ప్రత్యుత్తర మొసంగెను.

నాన్సన్‌కు కావలసిన యోడను నిర్మించుటకై కోలిన్ ఆర్చర్ (Colin Archer) అను ప్రసిద్ధ నౌకా నిర్మాతయొకడు పూనుకొనెను. ఈతడు విచిత్రాకారముగల యొకపడవను సిద్ధపరచెను. ఇది 400 టన్నులయోడ. దీనిపొడవు 128 అడుగులు, వెడల్పు 36 అడుగులును. దీని నిర్మాణమునకై ఉపయోగింపబడిన కట్టెమందము సుమారు ఇరువదియెనిమిది అంగుళములు. ఇంతటి బలమైన యోడ ఆర్కిటిక్ సముద్రమునందు ప్రయాణమునకై మరెన్నడును పోయియుండలేదు. ఈయోడయందొక వైశిష్ట్యముగలదు. దీనిముందుభాగమును, వెనుకభాగమును, అడుగుభాగమునుకూడ గుండ్రముగ తీర్చబడెను. కావున మంచుకొండలనడుమ యిది చిక్కుకొనినను అవి ఈ యోడను నొక్కివేయుట సాధ్యపడదు. 1892 అక్టోబరు 25 వ తేదీనాడు ఈ యపూర్వనౌక సముద్రమున విడువబడెను. నాన్సన్ భార్య స్వహస్తములతో ఓడకుమద్యాభిషేచనముచేసి దానికి "ఫ్రామ్" (Fram) అని నామకరణము

కావించెను. ఫ్రామ్ అను నార్వే పదమునకు పురోగామియని అర్థము. ఏమిసంభవించిననుసరే ముందునకుసాగిపోవలయునను నాన్సన్ నిశ్చయమున కియ్యది అనుగుణమగు నామము.

ప్రయాణమునకై కావలసిన శాస్త్రీయ సాధనములను, ఆహారమును, తదితర వస్తువులను నాన్సన్ స్వయముగ పరీక్షించి ఓడయందు చేర్చుకొనెను. ధనాధికులు కొందరు ఈ పరిశోధకవర్గమువారి యుపయోగమునకై ముప్పది కుక్కలను వేయిమైళ్ళదూరము ప్రయాణముచేసి ఆర్క్టిక్ సముద్ర తీరమున చేర్చుటకును, న్యూసైబీరియా దీవులయందు పరిశోధకులకొరకై ఆహార కేంద్రముల నెలకొల్పుటకును అంగీకరించిరి. ఇతరులుకూడ నాన్సన్‌కు అనేకవిధముల చేయూతనొసంగిరి. నాన్సన్‌తో కలిసి ఈ ప్రసిద్ధ పరిశోధక ప్రయత్నమునందు పాల్గొనుటకై పలువు రుత్సాహపడిరి. కాని, స్వదేశీయులనుమాత్రమే ఆత డెన్నుకొనెను. 1893 వ సంవత్సరము జూలై నెల 15 వ తేదీని "ఫ్రామ్" ఓడ తన ప్రసిద్ధమైన ప్రయాణమును ప్రారంభించెను. 17 వ తేదీన వారు తమ దేశమును సంపూర్ణముగ గడచి మంచుతెరలో మాయమైరి.

ఫ్రామ్ ఓడకు మొదటినుండియు కష్టమైన ప్రయాణము సంప్రాప్తించెను. సముద్రపుటలలు మహోన్నతముగ నెగయుచు, ఓడనంతను తడిపివేయసాగెను. మంచుపొగవలన వారికి దారి కనుగొనుట కష్టమయ్యెను. ఈ విధముగ రష్యాదేశపు పశ్చిమతీరమునంటి ప్రయాణముచేసి నాన్సన్ మున్నగు వారు నోవాజెంబ్లా ద్వీపమునంటియును, కారా సముద్రమును (Kara Sea) ప్రవేశించిరి. ఈ సముద్రమెల్లప్పుడును మంచు

తెరలతో నిండియుండును. కాని, అచ్చటచ్చట సన్నని త్రోవలుమాత్ర మేర్పడియుండును. ఫ్రామ్ ఓడ ఈ దారుల గుండ నెమ్మదిగ ముందునకు సాగిపోసాగెను. ఈ సముద్రతీర మున అనాగరకులును, పశుప్రాయులు నగు జనులు నివసిం చెదరు. ఫ్రామ్ ఓడలోనివారి కిదియే తుది మానవ సందర్శ నము. మరల మూడు సంవత్సరములవరకును వారు లోకటి మానవులను చూడలేదు. కారాసముద్రము నతిక్రమించిన తరువాత ఫ్రామ్ ఓడ ప్రయాణము మిక్కిలి నెమ్మదిగ కొన సాగెను. మార్గమంతయు మంచుతో నిండియుండెను. వెను కకుమరలి మంచుగడ్డలను తప్పించుకొని ఇంకొక మార్గము నవలంబింతమని ప్రయత్నించునంతలో అచ్చటకూడ మంచు తెరలు మూసుకొనిపోవుచుండెడివి. ఒక్కపర్యాయము గాలి వీచినయెడల మంచుతెరలన్నియు కొట్టుకొనిపోయి మార్గము సుగమమగును. ఇట్టి మారుతమునకై నావికు లెదురుచూడ సాగిరి. కాని, ప్రకృతి యేవరమును మనముకోరినరూపమున ప్రసాదింపదు. కొలదిదినములలో గాలివీచుట మొదలై మంచు తెరలు దూరముగ కొట్టుకొనిపోయెను. కాని, ఆ వాయువేగము నకు ఫ్రామ్ ఓడతట్టుకొనజాలక భయంకరముగ నూగజొచ్చెను. ఓడలోని వస్తువులన్నియు నిటునటు దొరలిపోసాగెను. మొత్తముమీద ప్రయాణమునకుమాత్రము చక్కని అను కూలత యేర్పడెను. నాన్సన్ ప్రభృతు లచ్చటచ్చట కొంత కాలము విశ్రాంతిగైకొనుచు, జంతువులను వేటాడి పరిశుభ్ర మైన యాహారమును సంపాదించుచు ఉత్తరాభిముఖముగ పోజొచ్చిరి. ఫ్రామ్ ఓడ ఐరోపాఖండపు పశ్చిమతీరమునంటియే

సాగిపోయెను. ఈ దినములలో వీరికి సూర్యరశ్మి మిక్కిలి అరుదుగ కాన్పించెడిది. వాతావరణ మెల్లప్పుడును మంచు పొగతో నిండియుండెడిది. సెప్టెంబరు మొదటివారములో ఫ్రామ్ ఓడ చెల్యూస్కిన్ (Chelyuskin) అగ్రమును చేరెను. ఇదియే యూరేషియా ఖండమునకు తుది భాగము. ఇచ్చటికి వీరు చేరుసరికి వాతావరణము మారి తుపానుగాలులు ప్రారంభించెను. ఈ ప్రదేశమునందు కొన్ని దినములు విశ్రాంతి గైకొనవలయునని నాన్సన్ మిత్రులు సలహాయిచ్చిరి. కాని, ఆత డందులకు సమ్మతింపలేదు. అవకాశము లభించినంతవరకును ముందునకు సాగిపోవుటయే ఆతని మతము. కావున ఫ్రామ్ ఓడ తన తెరచాపలనన్నిటిని ఎత్తించివైచి ఆవిరి యంత్రముల సహాయముతో చెల్యూస్కిన్ అగ్రమును చుట్టి పూర్వాభిముఖముగ పరువెత్తసాగెను. అతి దుస్తరమైన తమ యాత్రయందొక విషమఘట్టమును గడచితిమని నావికులందరును సంతోషింపసాగిరి. కొంద రానందాతిశయముచే పాడజొచ్చిరి. చెల్యూస్కిన్ అగ్రము దాటిన కొలదికాలమునకు నాన్సన్ తన యోడమార్గమును మార్చి సముద్రమధ్యము వైపు మరలించెను. న్యూసైబీరియా దీవులను సమీపింపవలయునని వారి యుద్దేశము. ఈ ప్రాంతములందే 1881 వ సంవత్సరమున జీనెట్ ఓడ భగ్నమయ్యెను. ఈ ప్రదేశమునందుసైతము సముద్రము నౌకాయానమున కేమంత దుర్గమముగ లేకుండెను. దినదినమును ఓడ సులభముగ ఉత్తరదిశగ ప్రయాణము చేయసాగెను. ఈ విధముగనే ఉత్తరధ్రువమును కూడ చేరవచ్చునని కొందరు నావికులు భ్రమపడిరి. సెప్టెం

బరు ఇరువదవ తేదీనాటికి వారు 78వ ఉత్తర తులాంశ రేఖను సమీపించిరి. అచ్చట ఓడ గమనము మందగించెను. అనతి దూరమున సువిశాలమును, పాషాణప్రాయమునగు హిమ వారాశి వారికి గోచరమయ్యెను. ఫ్రామ్ ఓడ మెల్లగ ముందు నకు సాగుచుండెను. కాని, అతి శీఘ్రకాలములో మంచు దిబ్బలు ఓడను చుట్టివేయును. ఓడ ప్రాలేయకారాగారము నందు బందీగ చిక్కుకొనుట తథ్యము.

నిర్జనమైన సముద్రమధ్యమున ప్రయాణము చేయు చున్నను నావికుల నిత్యజీవితము సుఖప్రదముగనే ఉండెను. వారికి వలసినంత పరిశుభ్రమైన ఆహారము లభించుచుండెను. అప్పుడప్పుడు జంతువుల వేటవలన సద్యోలబ్ధమగు మాంసము నకుకూడ కొదువలేకుండెను. నావికులలో నెవ్వరును రోగగ్రస్థులు కాలేదు. అందులకు మారు వారెల్లరునుకూడ మునుపటికంటె దృఢముగ కాన్పింపసాగిరి. ప్రశాంతమైన ఆ ఉత్తర సముద్రమున కొన్ని దినములు గడపినపక్షమున నర ముల బలహీనతవలన బాధపడు రోగుల కుపశాంతి లభింప గలదని నాన్సెన్ పల్కుచుండెడివాడు. మానవలోకమందు సాధారణముగ మనల చికాకుపరచు బాధ లచ్చట నుండవు. ఓడయందు అందరు ప్రయాణీకులును సమానులు. అందు తారతమ్యములు లేవు. వంటచేయుట, ఓడనుతుడిచి శుభ్ర పరచుట, ఇంజనువద్దకు బొగ్గుచేరవేయుట మున్నగు అన్నిపను లనుకూడ వరుసగా ఒకరితరువాత నొకరు విధిగా చేసితీరవల యును. నాయకుడైన నాన్సెన్ కూడ సంతోషపూర్వకముగ నీ కార్యక్రమమందు పాల్గొనుచుండెడివాడు. అన్యోన్యసహ

కారమువలన వారి జీవితము మిక్కిలి సౌఖ్యవంతముగ పరిణమించెను. ఓడయందు వారు తమకు కావలసిన చిన్న పెద్ద వస్తువులనన్నిటిని స్వయముగా చేసికొనెడివారు. రాత్రి పడగానే వారందరును భోజనముచేసి ధూమపానము చేయుచు, ఆనందముగ సంగీతములుతీయుచు, కొంచెము ప్రొద్దుపోయి నిద్రించుచుండెడివారు. అట్టి వేళలందు ఫ్రామ్ ఓడయందు గస్తీ తిరుగుచుండు ఒక్క నావికుని పాదధ్వనులును, కుక్కయరపును తప్ప సంపూర్ణమైన నిశ్శబ్దము ప్రబలియుండెడిది. ఓడప్రయాణము చేయుచున్నప్పుడు నాన్సన్ మున్నగువారు శాస్త్రీయ విషయికమగు పరిశీలనములందు నిమగ్నులై, సముద్రముసీటిని పరీక్షించుటయు, అందు లభించిన పదార్థములను దుర్భిణీ యంత్రముతో పరిశీలించుటయు, సముద్రపు లోతును కనుగొనుటయు మున్నగుపనులు చేయుచుండెడివారు.

కొన్నిదినములపాటు ఫ్రామ్ ఓడ కొంతదూరము ఉత్తరముగపోయి మరికొంతదూరము వెనుకకు (దక్షిణమునకు) పోవుచు ఊయలవలె నూగుచుండెను. అక్టోబరు నెల ప్రారంభము కాగానే మంచు విస్తారముగ కొట్టుకొని వచ్చుటయు, మంచుకొండ లొండొంటితో తాకి భయంకర నినాదములతో పగులుచుండుటయు సంభవింపసాగెను. అట్టి సమయములందు పెద్ద పెద్ద మంచుగడ్డ లాకాశమున కెగిసి ఓడయందు ఫిరంగి గుండ్ల వర్షమువలె పడుచుండెడివి. వీనివలన పడవకేమి అపాయము సంభవించునోయని నాన్సన్ భయపడుచుండెడివాడు. ఫ్రామ్ ఓడ మిక్కిలి మందగమనముతో నుత్తరాభిముఖముగ పోవసాగెను. కాని ప్రవాహపుగతిని జూచి తమ

యోడయందు ఉత్తరధ్రువమును చేరుట అసంభవమని నాన్సన్ నిశ్చయించుకొనెను. ధ్రువమును చేరుటకై ఆతడు తన మనస్సునందొక పథకమునుకూడ నిశ్చయించుకొనెను. కాని దానిని తన మిత్రులకు కొంతకాలమువరకును తెలుపలేదు. అక్టోబరు నెలయందే ఈ ధ్రువప్రాంతములలో సూర్యుడస్తమించెను. ఫిబ్రవరి నెలవరకును వారికి సూర్యదర్శనము కాలేదు. కాని ఇరువదినాల్గు గంటలును ఓడపై విద్యుద్దీపములు వెలుగుచుండుటవలన వారికెట్టి కష్టమును కల్గెడిది కాదు. అంతేకాక ఈ నాల్గునెలలును రాత్రిందినములు వారికి చంద్రుడు కన్పించుచుండెను. చలికాలమంతయు మంచు శిఖరలు ఫ్రామ్ ఓడను చుట్టుకొనియే యుండెను. కాని వాని ఒత్తిడివలన ఓడ కపాయములేదనియు, తమ ప్రయాణమున కవి నిరోధమును కల్పింపజాలవనియు నావికులు నిశ్చయించిరి. అవసరమైనయెడల సముద్రములో ప్రేలుడు పదార్థముల (Explosives) ను పారవైచి మంచుకొండలను పగులగొట్టుచు ముందునకు సాగిపోవలయునని నాన్సన్ నిశ్చయము. ఫిబ్రవరి నెల ప్రారంభమగుసరికి వారు 80 వ ఉత్తర అక్షాంశరేఖను చేరిరి. ఈ ప్రదేశములందు సముద్రము సుమారు మూడు మైళ్ల లోతుగనున్నట్లు వారు కనుగొనిరి.

దుర్భరమైన యీ చలిప్రదేశములలోకూడ నాన్సన్ శీతలబాధ ననుభవింపలేదు. వజ్రశరీరుడైన యాతని కది చిరుచలిగా మాత్రము తోచెనట. కొన్ని సందర్భములలో ప్రవాహము దక్షిణాముఖముగ నున్నట్లు ఆతనికి తోచెడిది. అట్టి తరుణములలో నాతడు ముందువెనుక లాలోచింపక

ఏదో ఒకవిధముగ ఉత్తరధ్రువమును చేరవలెనని నిశ్చయించు కొనెడివాడు. "ఒక కార్యమును సాధింపవలెనని నిశ్చయించుకొనినమీదట దానిని చేయక విడుచుట పురుష లక్షణము కాదు. నాకొక్కటే మార్గముకలదు. అది ముందుగ్రోవ." అని నాన్సన్ తన దినచర్య పుస్తకములో వ్రాసికొనెను.

నవంబరు (1894) నెలలో నాన్సన్ తనభావి కార్యక్రమమునుగూర్చి ఓడకు నాయకుడైన స్వెర్డ్రప్ (Sverdrup) తో ప్రసంగించెను. ఫ్రామ్‌ఓడ సముద్ర ప్రవాహములోపడి కొట్టుకొని పోవుచుండుటయేకాని ఉత్తరధ్రువమును చేరగల్గుట అసంభవము. కావున తానును మరియొక మిత్రుడును మాత్రము ఉత్తరధ్రువమును చేరుటకై స్లెడ్జి బండ్లను, కాయక్ (తోలుతోచేయబడిన దోనె)లను తీసికొని బయలుదేరుదురు. ఫ్రామ్ ఓడ స్వెర్డ్రప్ యాజమాన్యమున నెమ్మదిగ స్వదేశమునకు మరలి పోగలదు. మిత్రుడును తానును మంచు ప్రవాహములలో తేలుచు, ఫ్రాంజ్ జోసెఫ్ లాండ్ (Franz Josef Land) అను ద్వీపమునుకాని, స్పిట్స్ బర్జన్ ద్వీపమును కాని చేరగలరు. ఈ పథకము నావికులందరికినికూడ నాన్సన్ విశదపరచెను. ఇందుల కందరును అంగీకరించి, నాన్సన్‌తో ధ్రువమువద్దకు ప్రయాణము చేయగల్గు మహత్తర గౌరవమెవరికి లభించునోయని ఎదురుచూడసాగిరి. నాన్సన్, జాన్సన్ (Johansen) అను మిత్రునొకని నిందులకై ఎన్నుకొనెను. స్లెడ్జిబండ్లనులాగు కుక్కల నాత డదుపులోనుంచినట్లు మరెవ్వరును చేయజాలరు. అంతేకాక అతడు మిక్కిలి ధైర్యసాహసములు గలవాడు. కావున నాన్సన్ అతనిని తనతో తీసుకొని

పోవునట్లు నిర్ణయించుకొనెను. డిసెంబరు నెల సమాప్తము కావచ్చుసరికి ఫ్రామ్‌ఓడ 83·34 ఉత్తర అక్షాంశరేఖను చేరెను. అంతటి దూరమువరకును మరెవ్వరు నితఃపూర్వము పోగలిగియుండలేదు. ఒకనాడు ఫ్రామ్‌ఓడ భయంకరమైన మంచుకొండలలో చిక్కుకొని పోయెను. అవి ఒండొంటితో తాకుచు, భగ్నమగుచు బ్రహ్మాండమగుధ్వనిని చేయుసాగెను. ఆ ఆర్భాటములో ఒకరిమాట యొకరికి వినరాకుండెను. ఏ నిమిషమందైన ఓడ భగ్నమై పోవునని నాన్సెన్ నిశ్చయించెను. అట్టిపరిస్థితి యేర్పడిన పక్షమున చిన్న పడవలలో దిగి ప్రాణము రక్షించుకొనుటకై సర్వసన్నాహము కావింప బడెను. నావికులందరును ఆనాటిరాత్రి ప్రాణము లరచేత పెట్టుకొని ఓడ పైభాగమున నిద్రించిరి. ఓడ భగ్నమైన పక్షమున అందరును సముద్రములో దూకవలయునని నిర్ణయింపబడెను. కాని వారు తలంచిన ప్రమాదము సంభవింప లేదు. ఫ్రామ్‌ఓడ హిమపరీరంభమునుండి మెల్ల మెల్లగ వెలువడెను. అంతటితో అపాయము దాటిపోయెను. ఓడ ప్రశాంతముగ ఆ మంచు సముద్రమున సాగిపోజొచ్చెను.

నాన్సెన్‌ను ఆతని మిత్రుడగు జాన్సన్‌ను ఉత్తరధ్రువమును చేరుటకై కావించిన సాహసప్రయత్నమునకు పరిశోధక చరిత్రమునం దెచ్చటను సాటిలేదు. ఈ ప్రయాణమునందు వీరు చూపిన ఓరిమి, పట్టుదల, నిర్భీకత మున్నగునవి అత్యద్భుతములు. వీరు కావింపదలచిన ప్రయాణ మత్యంత ప్రమాదభూయిష్ఠమైనది. త్రోవయందు మంచుకొండలు, మంచుగోతులు అడుగడుగునకును కాన్పించుచుండును. శీతల

బాధ భరింపరానిది. వీరి ప్రయాణము మంచుదిబ్బలమీాద సాగవలయును. ఈమంచుదిబ్బలు సముద్రముపై తేలియాడుచు ఒకప్పుడు ముందునకును, మరొకప్పుడు వెనుకకును పోవు చుండును. ఈ విధముగ విహారముసల్పు మంచు తెప్పలు అనేక సందర్భములలో వారు దినమంతయు కష్టపడి కావించిన ప్రయాణమును వమ్ముచేయవచ్చును. ఈ కష్టములకుతోడు స్లెడ్జి కుక్కలను నిరంతరము అదుపాజ్ఞలలో నుంచుట మరి యొక సమస్య. ఈ కష్టనిష్ఠురములన్నియు నాన్సను ఎరుంగక పోలేదు. అదృష్టదేవత సైతము తమ్ము తరచు వంచించు చుండునని ఆత రెఱింగియేయుండెను. అయినను పట్టినపట్టు వీడక నాన్సన్ యీ ధ్రువయాత్రకై బయలు దేరెను. 1895 వ సంవత్సరము మార్చి నెల పదునాల్గవ తేదీని నాన్సన్, జాన్సన్ లీ ప్రయాణమును ప్రారంభించిరి.

పైన తెలుపబడిన కష్టములన్నిటిని ఎదుర్కొనుచు పరి శోధకులు తమ యాత్రను సాగించిరి. ఇట్టి జీవితమునందు సుఖ మనునదిసున్న. వీరు ధరించిన దట్టమైన యున్నిదుస్తులుకూడ సంపూర్ణముగ తేమబారెను. వాని నెండబెట్టుటకై ఎట్టి అవ కాశమును లభింపదని వేరుగ తెలుపనక్కరలేదు. ఉదయమును సాయంకాలమును భోజనముచేయుటయు, నిద్రకొరకై ఏర్ప డిన ప్రత్యేకపు సంచులలో దూరి కొంతకాలము మెసురచి నిద్రించుటయుమాత్రమే వారికి లభించెడి సౌఖ్యపుగడియలు. ఇట్టి పరిస్థితులలోకూడ ధీరులగు వీరు దినమునకు పది పండ్రెండు మైళ్ళచొప్పున ప్రయాణముచేయుచు ఉత్తరదిక్కుగ సాగిపోయిరి. కొన్ని దినములలో ప్రయాణము మరికొంత వేగ

ముగకూడ నడచెడిది. ఈ విధముగ తొమ్మిది దినములు గడచినతరువాత స్లెడ్జి కుక్కల కాహారము కరవయ్యెను. కావున పరిశోధకులు మిక్కిలి విచారముతో వానిలో నొకదానిని చంపవలసినవారైరి. కాని, మొట్టమొదట ఆ శ్వానములుతమ సహచరుని మాంసమును ముట్టుటకు నిరాకరించియు, తుదకు క్షుద్బాధకు సహింపలేక అందుల కొడబడెను. ముందునకు సాగినకొలదియు వీరి కష్టములు హెచ్చసాగెను. కుక్కలన్నియు ఒక మంచుగోతిలో పడిపోయెను. వానిని ప్రాణములతో పైకి లాగునరికి పరిశోధకులకు తలప్రాణము తోకకువచ్చెను. త్రోవయందు వీరికి మరియొక కష్టము సంభవించెను. అపారమైన యీ మంచుకొండలలో వారి కచ్చటచ్చట సీటిపాయలు తారసిల్లెడివి. వానిని దాటుటకై తమవద్దనున్న తోలు నావలను వారుపయోగించెడివారు. అట్టి సందర్భములలో స్లెడ్జి బండ్లను, కుక్కలను నావలోనికెక్కించుకొని నాన్సన్‌ను, మిత్రుడును ఆవలియొడ్డునకు చేరుచుండెడివారు. ఈ విధముగ ఇరువది దినములు ప్రయాణము సాగునప్పటికి కుక్కలును, పరిశోధకులునుకూడ సంపూర్ణముగ అలసిపోయిరి. బండ్లను లాగుటకు కుక్కలకు శక్తిలేకపోయెను. నాన్సన్‌వంటి బలాఢ్యుడును, కష్టసహిష్ణువునుకూడ ఆ శ్రమ కోర్వలేకపోయెను. ఒక్కొక్కనాడాతడు భోజనముచేయుచు సగములో నిద్రపోయెడివాడు. ఏప్రిలు 5 వ తేదీని వారు నాల్గుమైళ్ళు మాత్రము ప్రయాణము చేయగల్గిరి. మరి మూడుదినము లీ విధముగనే సాగిపోయి ఇక ముందునకుపోవుట సాధ్యము కాదని తెలిసికొని ఏప్రిలు 8 వ తేదీని నాన్సన్ వెనుకకు మర

లుటకై నిశ్చయించెను. అప్పటికి వారు 86·13 ఉత్తర అక్షాంశరేఖను చేరిరి. ఎవ్వరును అంతకుపూర్వ ముత్తర ధ్రువమున కంత సమీపమువరకును పోయియుండలేదు. ధ్రువ మింకను 260 మైళ్ళదూరమున నుండెను. తామున్న ప్రదేశమునుండి దక్షిణాభిముఖముగ బయలుదేరి ఫ్రాంజ్ జోసెఫ్ లాండ్ అను ద్వీపముల చేరవలెనని నాన్సన్ నిశ్చయించెను. కొన్ని దినములవరకును వారు సులభముగ దక్షిణముకు పోగల్గిరి. కాని, ఆమీదట ప్రవాహ ముత్తరదిశకు మరలెను. దానివలన పరిశోధకులు మిక్కిలి కష్టపడి చేసిన ప్రయాణమెల్ల వ్యర్థమయ్యెను. అనేక ప్రదేశములందు వారిని నీటిపాయ లడ్డగించుచుండెడివి. వీనిని దాటుట మిక్కిలి కష్టసాధ్యముగ నుండెను. ఇది యిట్లుండగా యీ నడుమ కాలములో వారొకటివెనుక నొకటిగ కుక్కలనన్నిటిని చంపివైచిరి. మొదట చంపబడిన కుక్కలు మిగిలినవాని కాహారమయ్యెడివి. పరిశోధకులు తమతో తెచ్చుకొనిన ఆహారమునంతను తినివైచిరి. కావున ఏవైన జంతువుల వేటాడినగాని వారి కాహారము లేకుండెను. కావున వారప్పుడప్పుడు "సీల్" (Seal) అను నీటిమృగములను చంపి వాని మాంసముపై జీవింపసాగిరి. కొన్ని ప్రదేశములలో ఎలుగుగొడ్లు వీరిని దాకి చికాకుపరచెడివి. ఈ విధముగ అనేక విధములగు ప్రయాసములకు లోనై నాన్సన్ను, మిత్రుడును ఫ్రాంజ్ జోసెఫ్‌లాండ్ ద్వీపములను చేరిరి. ఫ్రామ్ ఓడను విడచి వెడలిపోయినతరువాత ధ్రువ ప్రాంతపు బిడారులలో వారు అయిదునెలలు గడిపిరి. ద్వీపమును చేరినతరువాత కొన్ని దినములపాటు వారు తీరరేఖ

ననుసరించి దక్షిణముగ ప్రయాణము కావించిరి. కాని, చలి కాలము మరల సమీపించుచున్నందున కొన్ని నెలలపాటాకే ప్రదేశమున శాంతముగ కాలముగడపి వసంతఋతువు ప్రారంభముకాగానే మరల ప్రయాణము చేయవలెనని నిశ్చయించి నాన్సన్, జాన్సన్‌లు ఆ ద్వీపముపై ఒక కుటీరమును నిర్మించుకొనిరి. మృగముల వేటాడి వాని మాంసమునే ఆహారముగ వాడుచు వారు చలికాలమునంతయు అచ్చటనే వెళ్ళబుచ్చిరి. వసంతఋతు ప్రారంభమున ప్రయాణము మరల ఆరంభమయ్యెను. సముద్రతీరముననే తమ పడవల నడపుకొనుచు వారు ఈ ద్వీపపు దక్షిణ తీరమునుచేరిరి. అచ్చట ఫ్రెడరిక్ జి. జాక్సన్ (Frederick G. Jackson) అను ఆంగ్లేయుడు రెండు సంవత్సరములనుండి పరిశోధనల సల్పుచుండెను. ఆ ఆంగ్లేయుని కలిసికొనుసరికి నాన్సన్‌కు బ్రహ్మానందము కలిగెను. మూడు సంవత్సరములైన తర్వాత ఆతనికి సోదరమానవులతో కలియుటకును, సంభాషించుటకును అవకాశము లభించెను. జాక్సన్‌ను, అతనితోటివారును నాన్సన్, జాన్సన్‌లకు హృదయపూర్వకమగు స్వాగతమొసంగిరి. కొన్నివారము లచ్చట గడపినవెనుక నాన్సన్‌ను, అతని మిత్రుడును తమ ఆంగ్ల మిత్రుని ఓడయందు స్వదేశమగు నార్వేకు వెడలిపోయిరి. మరికొన్ని దినములకు ఫ్రామ్‌ఓడయు, అందలి నావికులును సురక్షితముగ నార్వేను చేరినట్లు నాన్సన్‌కు తంతివార్త వచ్చెను. అందులకాతడెంతయు సంతసించెను. ఫ్రామ్‌ఓడ ఆర్క్‌టిక్ సముద్రములో తేలిపోవుచు తుదకు సురక్షితముగ స్పిట్స్‌బర్జెన్ ద్వీపమునుచేరి, అచ్చటినుండి ఎట్టి యవరోధమును

లేకుండ నార్వేను చేరెను. ఫ్రామ్‌నౌక యందును, స్వయము గనుకూడ నాన్సన్ కావించిన దుర్ఘట ప్రయాణములును, ఆతడు ప్రదర్శించిన సాహసమును, జ్ఞానపిపాసయు, ఆతనికి సమస్త పాశ్చాత్యప్రపంచమందును, అఖండమగు కీర్తి ప్రతిష్ఠలను సంపాదించెను. ఐరోపా జాతీయులెల్లరును పరిశోధకాగ్రగణ్యుడగు నాన్సన్‌ను అనేకవిధముల గౌరవించిరి.

ఇరువదవ శతాబ్ది యారంభమున ఉత్తరధ్రువమును చేరి గొప్ప పరిశోధకుడుగ ఖ్యాతిగాంచిన అమెరికా దేశీయుడు పియరీనిగూర్చి మనమింకొక పర్యాయము తెలిసికొందము.

---

## ప్రశ్నలు

1. ఆర్కిటిక్ మండలములోనికి విలియమ్ బారెంట్స్ కావించిన ప్రయాణమును, అందాతని యనుభవములును సంగ్రహముగా వర్ణింపుము.
2. ఫ్రిడ్జాఫ్ నాన్సన్ యొక్క విద్యాభ్యాసము, జీవితారంభమున నాతడు కావించిన పరిశోధనలను సంగ్రహముగా చెప్పుము.
3. ఉత్తరధ్రువమును చేరుట అసాధ్య విషయము కాదని నాన్సన్ కావించిన నిశ్చయమునకు కారణము లేవి?
4. ఆర్కిటిక్ సముద్రమున ఫ్రామ్‌నౌక కావించిన సాహసయానమును క్లుప్తముగా వర్ణింపుము.

5. ఉత్తర ధ్రువమును చేరుటకై నాన్సన్ కావించిన సాహసప్రయత్న మెట్టిది? అందాతడు కృతార్థుడయ్యెనో లేదో వివరింపుము.

6. ఫ్రాంమ్ఓడయందు నీవుకూడ ఒక నావికుడుగనున్నట్లు తలంచి నీయనుభవముల వర్ణింపుము.

7. విలియం బారంట్స్‌ను, ఫ్రిడ్జాఫ్ నాన్సన్‌ను కావించిన ప్రయాణములయందలి భేద, సామ్యముల నిరూపింపుము.

# 3. దక్షిణ ధ్రువము

మనము నివసించుచున్న భూగోళమున కుత్తర దక్షిణాగ్రములందు నిరంతము మంచుతో కప్పబడియుండు ప్రదేశములు కలవని మీకు తెలిసియేయున్నది. ఇందుత్తరపుకొనను ఉత్తర ధ్రువమనియు, దక్షిణపుకొనను దక్షిణ ధ్రువమనియు పిలుచుచున్నారు. దక్షిణ ధ్రువముకడ ప్రారంభించి భూగర్భములోనుండి ఉత్తర ధ్రువమునకొక రేఖను మనము గీయగల్గినపక్షమున నది భూగోళమునకు నట్టనడుమనుండి పోవును. మన భారతదేశము భూమధ్యరేఖ కుత్తరభాగమున నెలకొనియున్నది. కావున మనము నివసించు భూభాగ ముత్తరార్థగోళము. దక్షిణార్థగోళము మన దేశమునకు దక్షిణమున లేక దిగువభాగమున నున్నది. ఆ కారణముచే దానిని మనము పాతాళలోకమని వర్ణించినను సత్యదూరము కానేరదు. శ్రీ మహావిష్ణువుయొక్క అయిదవ అవతారము వామనావతారము. ఆ యవతారమందు విష్ణువు దేవతలకు శత్రువైన బలిచక్రవర్తిని పదభ్రష్టునిచేసి పాతాళలోకమునకు తరిమివైచెను. భరతఖండమునందు పరిపాలనము సల్పుచున్న దైత్యరాజగు బలిని సురపక్షపాతియగు విష్ణువు దక్షిణార్థగోళమందలి యొక దేశమునకు తరిమివైచెనని దీని యర్థము కావచ్చును. ఏది యెట్లున్నను దక్షిణ ధ్రువము మన భారతదేశమునకు దిగువ నెలకొన్న విషయము నిజము. దక్షిణ ధ్రువము సముద్రమట్టముకంటె పదివేల అడుగులు ఎత్తైన ఒక పీఠభూమిపై

నెలకొనియున్నది. దీని చుట్టునుగల సముద్రము సంవత్సరములో నధిక కాలము గడ్డకట్టియుండును. వేసవికాలమందు, అనగా సెప్టెంబరు నెలనుండి మార్చి నెల వరకును దక్షిణధ్రువ ప్రాంతమందు సూర్యుడెన్నడును అస్తమింపడు. అచ్చటి జనుల కారు నెలలవరకును ఒక్కటే దినము. కాని, భూమధ్యరేఖకు సమీపముననున్న మన దేశమునందు వలె అచ్చట సూర్యుడుదయమున తూర్పుదిక్కునుండి వెలువడి, మధ్యాహ్నమున నడినెత్తిపై ప్రకాశించి సాయంకాలమున పశ్చిమ సముద్రమున సంతర్ధానము కాడు. సూర్యభగవాను డీ ప్రాంతములందు కొంతవరకుమాత్రమే ఆకాశముపై కెక్కివచ్చి ఆ నిమ్న రేఖయందే ఎల్లప్పుడును ప్రయాణముచేయుచు, సౌమ్యతేజముతో నచ్చటి మంచుప్రదేశములకును, సరస్సులకును బంగారుచాయను కల్గించుచు ప్రకాశించుచుండును. చలికాలమం దిచ్చట ఆరు నెలలవరకును కనుచీకటియో, గాఢాంధకారమో అలముకొనియుండును. ఇచ్చటి శీతోష్ణస్థితి అత్యంత శీతలము. ఘనీభవోష్ణత (Freezing Point) కంటె నలుబది ఏబది డిగ్రీల కెక్కువ చలియుండును. ఈ ప్రాంతములలో గాలి ప్రచండవేగమున వీచుచుండును. ఇచ్చటి మంచుతుపాను లత్యంత భయంకరములైనవి. ఈ భూభాగములలో ప్రయాణముచేయువారు పలువురు వీనివలన తాత్కాలికముగ నంధులగుదురు. ధ్రువప్రాంతమున కేగుట కనేకములగు నితర ప్రమాదభూయిష్ఠములగు నాటంకములు గలవు. వానిని మనము ముందుముందు తెలిసికొనగలము.

ఒక శతాబ్దమునకు పూర్వమే కొందరు అమెరికా

పరిశోధకులును, ఫ్రెంచి పరిశోధకులును దక్షిణ ధ్రువమును చేరుటకై కొంతప్రయత్నమును సాగించిరి. ఆస్ట్రేలియా (Australia) నుండి దక్షిణ దిక్కుగ ప్రయాణముచేసి వీరు అంటార్కిటిక్ (Antarctic) భూఖండమును తాకియున్న సముద్ర తీరరేఖను కనుగొనిరి. కాని వారికి కన్పించినది తీరరేఖ యందలి స్వల్పభాగము మాత్రమే. తీరమునంటియున్న భూభాగమెట్టిదియో వారికించుకయు గోచరింపలేదు. కాలము గడచినకొలదియు, అగమ్యమగు నీభూభాగమును పరిశోధింప వలయునను కోర్కె పాశ్చాత్యులయందు హెచ్చసాగెను. ఈ ధ్రువప్రాంతమునుండి వీచుగాలులును, ప్రవహించు సముద్ర ప్రవాహములును ఆస్ట్రేలియా ఖండముపై తమ ప్రభావమును నిరంతరము చూపుచుండును. అందువలన ఆస్ట్రేలియా ఖండములోని అడిలైడ్ (Adelaide) విశ్వవిద్యాలయములో అధ్యాపకుడుగనున్న డగ్లస్ మాసన్ (Douglas Mawson) అను ప్రకృతి శాస్త్రజ్ఞుడు, అంటార్కిటిక్ ఖండ మందలి విశేషములను తెలిసికొనవలెనను ఉద్దేశముతో 1911 వ సంవత్సరమున కొందరు మిత్రులతోకూడి దీనిక పరిశోధకారంభమునకు పూనుకొనెను. ఈతడు నాల్గుసంవత్సరములకు పూర్వము మరియొక పరిశోధకునితో కలసి న్యూజిలాండు (Newzealand) నుండి దక్షిణదిశకు ప్రయాణము సాగించి యుండెను. మాసన్ యొక్క ప్రయత్నములగూర్చి విని ఆస్ట్రేలియా ప్రభుత్వమును, ఆంగ్లప్రభుత్వమును ఈ పరిశోధక వర్గమునకు చాలధనసహాయము కావించిరి. అనేకులు శాస్త్రజ్ఞులతోకూడ డాక్టరు మాసన్ 1911 వ

సంవత్సరము డిసెంబరు నెలయందు టాస్మానియా (Tasmania) ద్వీపమునుండి అరోరా (Aurora) యను ఓడయందు బయలు వెడలెను.

ఈపరిశోధక వర్గమువారు మొట్టమొదట టాస్మానియా ద్వీపమునకును, అంటార్కిటిక్ భూ ఖండమునకును నడుమగల మెక్వారీ (Macquarie Island) అను ద్వీపముపై నొక నిస్తంత్రీ వార్తాస్థానము (Wireless Station) నెలకొల్పిరి. అచ్చటి నుండి ముందునకు సాగిపోయి ఈ పరిశోధకులు అంటార్కిటిక్ భూఖండముపై ఓడదిగిరి. ఈప్రదేశమునకువారు కామన్వెల్త్ బే (Commonwealth Bay) యని పేరిడిరి. దీనినే డాక్టర్ మూసన్ తనకు ముఖ్యస్థావరముగ కావించుకొని, చలికాల మందు నివసించుటకై అనుకూలమగు వసతిగృహమును నిర్మించుటకు పూనుకొనెను. భయంకరమగు మంచు తుపానులు చెలరేగి వీరి సాధన సామగ్రులను కొట్టివేయ సాగెను. కాని ఈ కష్టముల నన్నిటిని సహించి మూసన్ ప్రభృతులు కామన్వెల్త్ బే యందొక స్థావరము నేర్పాటు చేసికొనిరి. అనుకూలమగు తరుణమును చూచుకొని డాక్టర్ మూసన్ ఇద్దరు స్నేహితులతోడను కొన్ని స్లెడ్జి బండ్లతోను అంటార్కిటిక్ భూఖండమునందు ప్రవేశించెను. వీరిలో డాక్టర్ మెర్ట్జ (Dr. Mertz) అనునాతడు స్విట్జర్లాండు (Switzerland) దేశీయుడు. రెండవయాతడు లెఫ్టినెంట్ నినిస్ అను సైనికో ద్యోగి. కొంతదూరము పోవువరకును వీరియాత్రోవ సుఖముగ నుండెను. స్లెడ్జిబండ్లు వేగముగ ముందునకు సాగిపోజొచ్చెను.

కాని మరికొంతదూరము పోవుసరికి భూమియంతయు నిమ్నోన్నతములు హెచ్చెను. కొన్నిసందర్భములలో వీరు మూడు వేల అడుగుల ఎత్తుగల కొండలపై కెక్కవలసి వచ్చెను. కాని వీని నన్నిటిని మించిన మరియొక గొప్పకష్టము వారి నెదుర్కొనసాగెను. ఇచ్చటిభూమి ఎల్లెడల మంచుతో కప్పబడి యుండునని తెలిసికొంటిమి. కొన్నిప్రదేశములలో నీ మంచు తెరసన్ననిదై యుండును. అట్టి మంచుతెరల కడుగున పెద్ద గోతులేర్పడి యుండును. ఎవరైన పొరపాటున నీప్రదేశముపై నడచిన పక్షమున మంచుతెర పగిలి వారు దానియడుగున నున్న అగాధములోనికి క్రుంగిపోవుదురు. అట్టి హతభాగ్యుల కాఅగాధమే సమాధిగ పరిణమించును. మాసన్ ప్రభృతుల కీ అపాయ ప్రదేశములుకాని, అట్టి అపాయములు కల వనికాని ఎంతమాత్రమును తెలియదు. ఒకనాడు డాక్టరు మాసన్ స్లెడ్జిబండిని లాగుచున్నకుక్కలు ఒకక్షణములో అంతర్ధానమయ్యెను. పరిశోధక వర్గమువారు దిగ్భ్రమచెందిరి. ఇంచుక తెప్పరిల్లి ఇటునటు వెదుకగా కుక్కలు ఒకలోతైన మంచుగోతిలోపడి, ఉరికంబముపై వ్రేలాడు దోషులవలె, కాన వచ్చెను. మాసన్‌ను, అతనిస్నేహితులును తమశక్తినంతను ఉపయోగించి అతికష్టముపై కుక్కలను పైకిలాగుకొని వాని ప్రాణముల రక్షింపగల్గిరి. మరియొకనాడు భోజనసమయమున డాక్టరు మెర్ట్జ వడ్డనచేయుచుండెను. ఈలోపుగ కొన్నిఫోటోలను తీసికొనవచ్చునని తలంచి వేరొక ప్రక్కనుండి మాసన్, వేరొక ప్రక్కనుండి నినిస్ బయటకువచ్చిరి. మరి

కొన్ని నిమిషములకు మాసన్ తిరిగిచూచెను. కాని నినిస్ జాడలేదు. అతని తలయు, చేతులును మాత్రము భూగర్భము నుండి కానవచ్చుచుండెను. ప్రమాదవశమున నినిస్ పదు నేనడగుల సొరంగములో కూలి అతికష్టముపై మునిగిపోకుండ నిలువబడగల్గెను. మాసన్, మెర్ట్జను తమమిత్రునికడకు పరు వెత్తి త్రాళ్ళ సహాయమున నాతనిని పైకి లాగగల్గిరి. నాల్గు మెతుకులెట్లో నోటకొట్టుకొని పరిశోధకులా భయంకర ప్రదేశమునుండి తప్పించుకొని వెడలిపోయిరి.

మరియొక పర్యాయమిట్టి యాపద సంభవించినప్పు డదృష్టదేవత వారి కనుకూలింపలేదు. ఈ ప్రయాణములో వారికడనున్న మూడు స్లెడ్జిబండ్లలో నొకటి చెడిపోయినందున ఈఅన్వేషకులు తమ వస్తువులనన్నిటిని మిగిలిన రెండు బండ్లలో నింపి ప్రయాణమును సాగించిరి. అనుసరింపవలసిన మార్గ మును గుర్తుపెట్టుచు డాక్టర్ మెర్ట్జ ముందు సాగిపోవుచుండెను. ఒక స్లెడ్జిబండిలో డాక్టర్ మాసన్‌ను, రెండవదానిలో సైని కోద్యోగియగు నినిస్‌ను కూర్చుండి ప్రయాణముచేయుచుండిరి. మాసన్ తనకు కాన్పించిన విశేషములగూర్చి వ్రాసికొనుచు ఆలోచనానిమగ్నుడై యుండెను. మరికొంతసేపటికి వెనుకకు తిరిగిచూచుసరికి నినిస్‌కాని, అతని స్లెడ్జిబండికాని కానరా వయ్యెను. తన బండిజాడల ననుసరించి వెనుకకు పోవుసరికి మాసన్‌కు మంచులో నొక విశాలగహ్వరము కానవయ్యెను. ఆ గోతి కావలప్రక్క రెండు స్లెడ్జిబండ్ల గుర్తులు స్పష్టముగ కానవచ్చుచుండెను. కాని, యీవలప్రక్క నొకే బండిబాట

యేర్పడియుండెను. దురదృష్టవంతుడగు నినిస్‌ను, ఆతని బండియు నిందు పడిపోయియుండుట నిశ్చయము. మాసన్ అపరిమితమైన భయమునకు లోనై, పిచ్చికేకలు వేసి డాక్టర్ మెర్ట్జ్‌ను వెనుకకు పిలచెను. ఇరువురునుగూడ మంచుగోతిలోనికి వంగి ఉచ్చైస్స్వనముతో నినిస్‌ను పిలువసాగిరి. కాని, యెట్టి ప్రత్యుత్తరమును రాలేదు. వారివద్ద కొండల నెక్కుటకై ఉపయోగించు 150 అడుగుల బలమైన త్రాడు కలదు. దానిని వారా యగాధములోనికి విసరిరి. కాని త్రాడు సరిపోలేదు. ఆ యగాధములో నొక బండపై కుక్కలు మూల్గుచు పడియుండెను. నినిస్ జాడమాత్రము కాన్పింపలేదు. అత్యంత విషాదముతో పరిశోధకు లిరువురును తమ మిత్రుడు మరణించెనని నిశ్చయించి, అచ్చటనే ఆతని కంత్యక్రియలు నిర్వర్తించిరి.

నినిస్ మరణము ఈ పరిశోధకుల కత్యంత దుఃఖకారణమేకాక, కొన్ని యితర కష్టములనుగూడ కల్గించెను. పరిశోధకులు తమవద్దనున్న భోజనపదార్థములను, ఒక డేరాను, యితర సాధనసామగ్రిని నినిస్ ప్రయాణము చేయుచున్న స్లెడ్జిబండిలో నింపియుండిరి. ఈతని మరణము వలన నివియన్నియు నష్టపడెను. ఇక పరిశోధకులవద్ద పది దినములకు చాలినంత భోజనసామగ్రి మాత్రము నిలువయుండెను. అప్పటికి వారు కామన్వెల్త్ బేయందలి ముఖ్యస్థావరమునుండి మున్నూరుమైళ్ళకు మించి ప్రయాణము చేసియుండిరి. అననుకూల పరిస్థితులలో ముందునకు సాగిపోవుట

ప్రమాదకరమని నిశ్చయించి, మాసన్ మెర్ట్జలు వెనుకకు మరలిరి.

ఇప్పుడు వారికడ ఆరు కుక్కలుమాత్రము మిగిలియుండెను. అవికూడ మిక్కిలి అలసిపోయి స్లెడ్జిబండ్లను లాగుట కసమర్థముగ నుండెను. కావున మన అన్వేషకులే తమ బండ్లనుకూడ లాగవలసివచ్చుచుండెను. నిరుపయోగముగనున్న ఆ కుక్కలలో ఒకదానివెంబడి వేరొకదానిని చంపి, ఆ మాంసమును కొంత తాముతిని, మరికొంత కుక్కలకెరవైచి మాసన్‌ను, అతని మిత్రుడును మెల్లమెల్లగ ముందునకు సాగిపోజొచ్చిరి. శునకమాంసము తినుటవలననో, లేక తగినంత ఆహారమును, విశ్రాంతియు లేకపోవుటవలననో, డాక్టరు మెర్ట్జ అస్వస్థతకు లోనయ్యెను. అతని శరీరస్థితిని గమనించి మాసన్ ఆతనికి కుక్కమాంసమునీయక సామాన్యపు టాహారమునే ఇచ్చుచువచ్చెను. కాని అందువలనకూడ మెర్ట్జస్థితి బాగుపడలేదు. మరికొన్ని దినములకాతడు నడచుటకుకూడ అసమర్థుడయ్యెను. డాక్టరు మాసన్ తనమిత్రుని స్లెడ్జిబండిలో కూర్చుండబెట్టి తానేదానిని లాగనారంభించెను. కాని మెర్ట్జస్థితి క్రమముగ క్షీణింపసాగెను. ఈ విషయమును గుర్తించి మాసన్ ప్రయాణము నాపుచేసి, ఒకడేరానువేసి రోగినందు పరుండబెట్టి చాల రాత్రివరకును ఆతనికి సేవ చేయుచు మేల్కొనియుండెను. రోగి శాంతముగ నిద్రించుచున్నట్లు చూచి, మాసన్ ఇంచుక నిద్రించెను. మరిరెండు

గంటలకు లేచిచూచుసరికి మెర్ట్జ మరణించియుండెను. మంచు రాళ్ళను కొన్నిటి నా శవముపై పేర్చి మాసన్, తన మిత్రుని కంత్య సంస్కారములు కావించెను.

భయంకరమైన మంచుబెడారిలో డాక్టర్ మాసన్ ఒక్కడుమాత్రము ప్రాణములతో నిలచియుండెను. కామను న్వెల్తు బే యందలి స్థావరమింకను నూరుమైళ్ళ దూరమున నున్నది. తనకడ తగినంత ఆహారము లేదు. దేహము మిక్కిలి అలసి, బలహీనముగ నుండెను. ఇట్టి స్థితియందు తానొంటరిగ గమ్యస్థానమును చేరగల్గుదునాయని మాసన్ చాల భయపడెను. కాని, గుండె దిటవుపరచుకొని తన స్లెడ్జిబండిని స్వయముగ లాగుచు ముందునకుసాగెను. మెర్ట్జ ధరించిన కోటును తెరచాపగ మార్చి దాని నాతడు స్లెడ్జిబండికి కట్టెను. గాలి అనుకూలముగనున్నప్పుడు స్లెడ్జిబండి గాలిత్రోపుడుచే శీఘ్రముగ పరువెత్తసాగెను. మాసన్ కామన్వెల్తు బే యందలి స్థావరమును సమీపించుచుండెను. ఆతని మనస్సునందుత్సాహము చెలరేగెను. కాని, యిట్టి సమయమున మాసన్ ఒక భయంకరమగు ఆపదకు లోనై అతి కష్టమునీద మృత్యువును తప్పించుకొనగల్గెను. ఒకనాడు మాసన్ తన స్లెడ్జిబండిని లాగుకొనుచు పోవుచున్న సందర్భమున నకస్మాత్తుగ నాతడొక మంచుగోతిలో పడిపోయెను. స్లెడ్జిబండికి కట్టబడిన త్రాళ్లుమాత్ర మాతని చేతినుండి తప్పిపోలేదు. కావున నాతడా త్రాళ్ళసహాయమున వ్రేలాడుచు అగాధములో పడిపోకుండ నిలువగల్గెను. స్లెడ్జిబండి గోతియొడ్డున నిలచియుండెను.

అతి కష్టముపై మాసన్ త్రాటిసహాయముతో పైకెక్కసాగెను. ఒడ్డును చేరుట కింకెంతయో దూరములేదు. అట్టి తరుణమున గోతియొడ్డునుండి ఒక పెద్ద మంచుగడ్డ విరిగి అగాధములో పడిపోయెను. దానివలన మాసన్ మరల చాలలోతునకు దిగిపోయెను. "బహుశః నా జీవితమున కిదియే సమాప్తి కాబోలు" అని మాసన్ విచారించెను. కాని, అట్టి భయానక ఘట్టమందుకూడ ఆత్మవిశ్వాసమును కోల్పోవక ఆతడు క్షీణించిన తన బలమునంతను ఒక్క పర్యాయము కేంద్రీకరించి, ఆ యగాధమునుండి బయటపడెను. ఒడ్డునకు చేరినమీదట ఒక గంటవరకు నాతడు మృతప్రాయునివలె పడియుండెను. అప్పుడు తిప్పిరిల్లి మాసన్ ప్రయాణమును సాగించెను. స్లెడ్జి బండి వేగముగ పరుగెత్తసాగెను. తుట్టతుదకు కష్టములను గట్టెక్కి ఆతడు కామన్వెల్త్ బే యందలి స్థావరమునుచేరెను. అప్పటి కాతనివద్ద ఒకపూటకు చాలినంత ఆహారముమాత్రము మిగిలియుండెను. స్థావరమందలి మిత్రులందరును మాసన్ రాకకు మిక్కిలి సంతసించిరి. కామన్వెల్త్ బేయందు సుమారొక సంవత్సరము గడపి డాక్టర్ మాసన్ ఆస్ట్రేలియాకు మరలిపోయెను. డాక్టర్ మాసన్ చేసిన కృషివలన అంటార్కిటిక్ ఖండముయొక్క తీరరేఖయందు 800 మైళ్లు పరిశోధింపబడుటయేకాక, అచ్చటి శీతోష్ణస్థితిని గూర్చియు, ఇతర ముఖ్యవిషయముల గూర్చియు అనేక నూతనాంశములు కనుగొనబడెను. జార్జిరాజు ధీరాన్వేషకుని సాహసకృత్యములకును, పరిశోధనలకును మిక్కిలి సంతసించి, ఆతనికి "సర్" బిరుదము నొసంగి గౌరవించెను.

దక్షిణ ధ్రువమును కనుగొనుటకై యత్నించిన ఇతర పరిశోధకులుకూడ కలరు. జేమ్సుక్లార్కురాస్, (James Clark Ross), రాబర్టు ఫాల్కన్ స్కాట్ (Robert Falcon Scott), సర్ ఎర్నెస్ట్ షాకిల్టన్ (Sir Ernest Shackleton) అను వారుకూడ ధ్రువప్రాంతమును చేరుటకు ప్రయత్నించిరి. వీరిలో రెండవవాడైన రాబర్టుఫాల్కన్ స్కాట్ అనువాడు 1912 వ సంవత్సరము జనవరిలో దక్షిణ ధ్రువమును చేరగల్గెను. కాని, అచ్చటినుండి మరలివచ్చు సమయమున అతడును, అతని మిత్రులును ప్రాణములు గోల్పోయిన వీరగాథ మనము ముందు తెలిసికొనగలము. దక్షిణధ్రువమునుచేరుటకు సరియైన మార్గము న్యూజిలాండు ద్వీపమునకు దక్షిణమునుండి కలదు. వేసవికాలమందు ఓడలు న్యూజిలాండునుండి దక్షిణముగ పదునాల్గునూర్ల మైళ్ళవరకును ప్రయాణము చేయువచ్చును. కాని ఈ కాలమందుకూడ వారికి తుపానులబాధ తప్పదు. అచ్చటినుండి పెద్ద పెద్ద మంచుకొండలు ప్రయాణముచేయు ఓడలకు గతినిరోధము కల్పించును. ఈ మంచుకొండలు (Icebergs) చాలవరకు నీటిలో మునిగియుండును కావున వాని వలన ఓడలకు తరచు గొప్పప్రమాదములు సంభవించుచుండును. ధ్రువప్రాంతములకుపోవు ఓడలు నీటిలోమునిగి కొట్టుకొనిపోవు నీ మంచుకొండలనుండి తప్పించుకొనుటకై మిక్కిలి శ్రద్ధవహింపవలసి యుండును. అంటార్కిటిక్ ఖండమునకు మరింత సమీపమునకు వచ్చునరికి సముద్రమంతయు మంచు దిబ్బలతోనిండి యుండును. ఈ మంచుదిబ్బలు ఇంతకుముందు తెలుపబడిన మంచుకొండలంత పెద్దవికావు. కాని ఈ దిబ్బలు

స్థిరముగ నొకచోట నిలచియుండక, ఒకప్పుడు ఒంటొంటితో కలసికొనిపోవును. మరొకప్పుడు విడిపోవుచుండును. కావున ఓడలు ప్రయాణము చేయవలసిన మార్గము స్థిరముగానుండక తరచు మారుచుండును. నావికులు తమపడవ లీమంచుదిబ్బలతో ఢీకొనకుండ చూచుకొనుచు ముందునకు సాగిపోవలయును. ఈ విధమైన మంచుదిబ్బలు ధ్రువప్రాంతములకు నలువైపులందును దట్టముగ క్రమ్ముకొని యుండుటవలన చిరకాలమువరకును పరిశోధకు లెవ్వరును, ఈ మంచు దిబ్బల లోనికి తమ పడవలను నడపుటకు సాహసింపలేదు.

విక్టోరియారాణి కాలమున కొందరు ఆంగ్ల పరిశోధకులు దక్షిణధ్రువ ప్రాంతములగూర్చి నూతనాంశముల తెలిసికొనవలయునను పట్టుదలతో ప్రయత్నము చేయసాగిరి. బ్రిటీషు నౌకా శాఖవారీ యత్నమునకు సహాయపడి జేమ్సు క్లార్కు–రాస్ అనునావికోద్యోగి యాజమాన్యమున రెండు ఓడలతో ఒక పరిశోధకవర్గమును పంపిరి. వీరు సురక్షితముగ తమఓడలతో అంటార్కిటిక్ మండలమును చేరుటయేకాక, మంచు దిబ్బలలోనిండిన ధ్రువసముద్రమునందు మిక్కిలి నేర్పుతో ఇనూర్నారుమైళ్ళవరకును ప్రయాణముచేసిరి. అప్పటికి మంచుసముద్రము పూర్తియై మిక్కిలి విశాలమగు మరియొక జలరాశి వారికి కాన్పించెను. ఆ సముద్రము సుమారు ఆరు వందల మైళ్ళ వరకును వ్యాపించియున్నట్లు పరిశోధకులంచనా వేసిరి. దక్షిణధ్రువమునకు చేరుటకై మార్గమింతటితో ఆగిపోయినట్లు వారికి కాన్పించెను. ఇచ్చట తూర్పుపశ్చిమముగా నొక పెద్ద మంచుకొండ వ్యాపించియుండెను. ఆ కొండ రమా

రము 80 గజములు ఎత్తుగనుండెను. అదేవిధముగ తూర్పు తీరముననుకూడ కొండవరుసలు వ్యాపించియుండెను. పశ్చిమ తీరమందలి కొండలు మిక్కిలి ఎత్తైనవి అందు రెండింటియెత్తు 13000 అడుగుల వరకునుండెను. వానిలోనుండి పొగదట్టముగ నెగయుచు మేఘముల కల్పించుచుండెను. అత్యంత శీతలమైన ఈ ధ్రువప్రాంతములందు అగ్ని పర్వతములు నెలకొని యుండుటజూచి పరిశోధకులు మిక్కిలి ఆశ్చర్యపడసాగిరి. ఈ పరిశోధక వర్గమునకు నాయకుడైన కాప్టెన్ జేమ్సు క్లార్కు రాస్ గౌరవార్థమిచ్చటి సముద్రమునకు రాస్ సముద్రమని పేరు పెట్టిరి. రాస్ ప్రభృతుల పరిశోధనలు 1841 వ సంవత్సరమున కావింపబడెను. ఆపైన సుమారు అరువదిసంవత్సరముల వరకును పరిశోధకులెవ్వరును ప్రమాదభూయిష్ఠమైన ఈ సాహస ప్రయత్నములకు పూనుకొనలేదు. కాని 1901 వ సంవత్సరమున రాబర్ట్ ఫాల్కన్ స్కాట్ అను ధీరుడు దక్షిణ ధ్రువప్రాంతముల పరిశోధనకై పూనుకొనెను.

రాబర్ట్ ఫాల్కన్ స్కాట్ అను ఈ ధీరనావికుడు 1868 వ సంవత్సరమున ఇంగ్లాండు దేశమందలి డీవన్ పోర్టు (Devonport) అను రేవుపట్టణమున జన్మించెను. పదమూడు సంవత్సరముల వయస్సుననే ఈతడు బ్రిటిషునౌకాసేనయందు ప్రవేశించి, ఇరువదియైదు సంవత్సరములవయస్సు వచ్చునప్పటికి నౌకాబలమందు గొప్పపదవిని పొందెను. మరికొంతకాలమున కాతనికి ధ్రువప్రాంతములను గురించి జరుగుచున్న పరిశోధననుగూర్చి తెలియవచ్చెను. ఉత్సాహవంతుడైన స్కాట్ ఈ పరిశోధనలయందు పాల్గొని, ఇతరులవలె తాను

సైతము సాహసకార్యములు కావింపవలెనని తొందరపడ సాగెను. కావున 1901 వ సంవత్సరమున దక్షిణధ్రువపరిశోధనకై ఇంగ్లాండునుండి బయలుదేరిన పరిశోధకుల సంఘమున కీతడు నాయకుడుగ నియమింపబడెను. వీరికి ధ్రువప్రాంతపు సముద్రముల తీవ్రమైన యొత్తిడికి తాళగలయొక ప్రత్యేకమైన ఓడయొసంగ బడెను. దానినామము "డిస్కవరీ" (Discovery). స్కాట్‌తోపాటు మిక్కిలి అనుభవశాలులైన నావికులును, శాస్త్రజ్ఞులునుకూడ బయలుదేరిరి. అంటార్కిటిక్ మండలమందీ పరిశోధకవర్గమువారు మూడుసంవత్సరములవరకును నివాసముగనుండిరి. ఈకాలమునందు వారు స్లెడ్జి బండ్లపైనను, కాలినడకనుకూడ అనేక ప్రయాణములును సాహసకృత్యములును కావించిరి. ఈ పరిశోధక వర్గమువారు 82 వ దక్షిణ అక్షాంశరేఖను చేరగల్గిరి. ఇచ్చటినుండి దక్షిణ ధ్రువము నాల్గునూర్ల అరువది మైళ్ళుదూరమున నుండెను.

1908 వ సంవత్సరమున ఎర్నెస్ట్ షాకిల్టన్ అను మరియొక పరిశోధకుడు దక్షిణ ధ్రువమును చేరుటకై తీవ్రమైన ప్రయత్నను చేసెను. కాని, యాతడు తన గమ్యస్థానమునకు నూరుమైళ్ళ దూరమున నాగిపోవలసి వచ్చెను. షాకిల్టన్ 88 వ దక్షిణ తులాంశరేఖను చేరెను. ఈ పరిశోధక వర్గమునందు కొందరు రాస్ సముద్రతీరమందు నెలకొనియున్న అగ్నిపర్వత ముఖమువరకును ఎక్కి, అచ్చటి విశేషముల పరీక్షించి అనేక నూతనాంశముల కనుగొనిరి. మార్గమునందీ పరిశోధకులొక మంచుప్రవాహపు టొడ్డు నుండి ప్రయాణము చేయుచున్నప్పుడు, యుగాంతరములందీ

భూమండల మొక యగ్నిగోళముగ నుండెనను విషయమును నిదర్శనపూర్వకముగ తెలిసికొనగల్గిరి.

1910వ సంవత్సరమందు స్కాట్ ధీరుడు దక్షిణ ధ్రువ పరిశోధనమునకై మరియొక పర్యాయము ప్రయత్నము చేసెను. ఈ పర్యాయము కాప్టన్ స్కాట్ "టెర్రా నోవా" (Terra Nova) (నూతన ప్రపంచము) అను ఓడపై ప్రయాణము సల్పెను. ధ్రువప్రాంతముల పరిశోధించుటకై పోయిన నితరులకును లభింపని యనుకూలతలు స్కాట్ పరిశోధక వర్గమునకు లభించెను. ఈ వర్గమునందు గొప్ప శాస్త్రజ్ఞులును, సముద్రయానమందు ముక్కాకలుతీరిన నావికులు నుండిరి. వీరు తమతో మోటారు స్లెడ్జిబండ్లనుకూడ తీసికొనిపోయిరి. ధ్రువప్రాంతముల పరిశోధించినవారిలో మోటారుబండ్లను వాడుటకు వీరే ప్రథములు. వీరితోపాటు సైబీరియా గుఱ్ఱములు, కుక్కలు, భోజనపదార్థములు, సమస్తమైన ఇతర ముఖ్యవస్తు సముదాయమును బయలుదేరెను. ఈ పరిశోధకుల ముఖ్యోద్దేశము దక్షిణధ్రువమును కనుగొనుటయేగాని అందులకుతోడు దక్షిణ సముద్రముల లోతును కనుగొనుటయు, అచ్చటి మంచుపర్వతముల పరీక్షించుటయు మున్నగు నితర కార్యములకూడ వారు తమ కర్తవ్యముగ భావించిరి.

ఈ పరిశోధక వర్గమువారు లండను నగరమునుండి బయలువెడలి గుడ్ హోప్ అగ్రముమీదుగ ఆస్ట్రేలియా ఖండమును చేరిరి. అచ్చట మెల్బోరన్ (Melbouren) నగరమునందు వీరికొక ఆశ్చర్యకరమగు సమాచారము తెలియ వచ్చెను. నార్వే దేశీయుడగు కాప్టన్ ఎమండ్సన్ (Captain

**Amundsen)** అను సాహసికుడగు మరియొక పరిశోధకుడు దక్షిణ ధ్రువమును కనుగొనుటకై పూనుకొన్నట్లును, ఆతడంతకుపూర్వమే తన గమ్యస్థానమును చేరుటకై బయలు వెడలెననియు ఆంగ్లపరిశోధక వర్గమువారు తెలిసికొనిరి. ఈ విధముగ నార్వే పరిశోధకులకును, ఆంగ్ల పరిశోధకులకును తలవనితలంపుగ పోటీ యేర్పడెను. ఆస్ట్రేలియానుండి స్కాట్ పరిశోధక వర్గమువారు న్యూజిలాండును చేరిరి. అచ్చటినుండి సోపానులకును, మంచుకొండలకును పుట్టినిల్లనగిదన దక్షిణ సముద్రముపై వీరు ప్రయాణముసాగించిరి. ఈ సముద్రము నందు తిమింగలములును, ఇతర భయంకర జలచరములును విస్తారముగనుండును. ఈ కష్టములనన్నిటిని గడచి ఈ పరిశోధకులు అంటార్కిటిక్ మండలమునందున్న పెద్దమంచుగోడను చేరగల్గిరి. ఇయ్యది రాస్ సముద్రమునకు దక్షిణసరిహద్దని ఈ వరకే తెల్పియున్నాము. సముద్రతీరమున మరికొంత దూరము ప్రయాణముచేసి వీరు "కేప్ ఈవాన్స్" (**Cape Evans** – ఈవాన్స్ అగ్రము) అనుచోట తమపడవకు లంగరువేసిరి. ఈవాన్స్ అనునాతడీ పరిశోధక వర్గమునందలి యొకనావికుడు. అచ్చటికి దక్షిణధ్రువము తొమ్మిదినూర్ల మైళ్ళదూరముననుండెను. ప్రమాదభూయిష్ఠమైన ఈఅద్భుత యాత్రను సల్పుటకై తగు ప్రయత్నముల సల్పుటయందే 1911 వ సంవత్సరములో చాలభాగము గడచిపోయెను. ధ్రువమునుచేరుటకై బయలుదేరెడి పరిశోధకులు తమకుకావలసిన భోజనపదార్థములు మున్నగువానినన్నిటిని తమతో కూడ తీసికొనిపోవుట సాధ్యమైన యంశముకాదు. కావున

వా రనుసరింపబోవుచుండిరి. మార్గమధ్యమున నిర్ణీతదూరమున ఆహార వస్తువుల మంచులో పాతిపెట్టుట యవసరమని నిర్ణయింపబడెను. పరిశోధకవర్గముతో బయలుదేరిన శాస్త్రజ్ఞులు అత్యంత ప్రాచీనములగు జీవజంతువుల శల్యావశేషములు, కొన్ని అపూర్వములగు గ్రుడ్లు మున్నగువానిని సేకరించుచు దినములు పుచ్చిరి.

నవంబరు నెలనాటికి దక్షిణార్ధగోళమందు చలికాలము వెనుకపట్టి వేసవి ప్రారంభమగును. కావున ఆ నెలలో స్కాట్ పరిశోధకవర్గమువారు తమగమ్యస్థానమును చేరుటకై కావలసిన అన్ని ఏర్పాట్లను చేసికొని సిద్ధముగ నుండిరి. మోటారుస్లెడ్జిబండ్లును, గుఱ్ఱములును, కుక్కలును, అన్నియు కూడ ఆయత్తపరుపబడెను. తామునివసించుచున్న స్థావరము నకు సమీపమున మంచులో నచ్చటచ్చట ఆహారకేంద్రములు లీవరకే సిద్ధముకావింపబడెను. దక్షిణమునకుగ పరిశోధక వర్గమువారు పోయినకొలదియు వారితో కూడ ప్రయాణము చేసి అరువదిమైళ్ల కొకటిచొప్పున ఒక ఆహారనిలయమును కల్పించుటకై కొందరు ప్రత్యేకముగ నియమింపబడిరి. ధ్రువమునుండి నూటయేబదిమైళ్ల దూరమువరకును ఇట్టి ఏర్పాట్లు కావింపబడును. మిగిలిన యీ పరిమితిని ఒక చిన్న పరిశోధకవర్గము మరేయితర సహాయమును లేకుండ గడచి గమ్యస్థానమును చేరవలయును. ఇట్టి ఏర్పాట్లతో స్కాట్ పరిశోధకవర్గమువారు చారిత్రక ప్రసిద్ధమైన తమప్రయత్నమునకు పూనుకొనిరి.

మొదట చాలదూరమువరకును వారు రాస్ సముద్రము

నంటియున్న హిమకుడ్యము (మంచుగోడ) పై ప్రయాణము చేసిరి. సామానులు మోసికొనుపోవుటకు మోటారు స్లెడ్జి బండ్లు వాడబడెను. అపరిమితమైన చలివలన కొన్నిసందర్భములలో మోటారు ఇంజన్లు స్తంభించిపోవుచుండెడివి. అనేక కష్టములకులోనై వారు తుదకు హిమకుడ్యమును దాటగల్గిరి. అచ్చట వారికొక పెద్దమంచునది (Glacier) కానవచ్చెను. ఈ నదిననుసరించి పరిశోధకులు పోవలసినవారైరి. హిమప్రవాహము పదివేల అడుగుల ఎత్తైన ప్రదేశముపై నుండెను. అతిప్రయాసముతో పరిశోధకు లీమిట్టనెక్కుచుండిరి. వారి ప్రయాణ మొకదినములో సంపూర్ణమగును. ఇట్టి సందర్భమున ప్రచండమైన మంచుతుపాను చెలరేగి పరిశోధకుల ప్రయాణమున కంతరాయము కల్గించెను. మంచుతుపానులు చెలరేగినప్పుడు గాలి భయంకరవేగమున వీచుటయేకాక దానితోపాటు హిమపరాగమును దట్టముగ నెల్లెడల నింపివైచును. పరిశోధకవర్గమువారు తమ డేరాలనుపాతి, వానియందే కొన్నిదినములవరకును ముడిచిపెట్టుకొని కదలక మెదలక పండుకొనియుండిరి. కుక్కలు దేహమును కుంచించుకొని నిద్రించెను. గుఱ్ఱములు తలదాచుకొనుటకు స్థలములేక గజగజ వణకసాగెను. డేరాలపై మూడడుగులయెత్తున మంచుపొడి కప్పివైచెను. కొన్నిదినములు గడచినమీదట తుపాను సంరంభము తగ్గిపోయెను. పటకుటీరములలో దాగుకొనిన పరిశోధకులు భూగర్భమునుండివలె బయటకు వచ్చిరి. అప్పటికి గుఱ్ఱములన్నియు చనిపోయెను. కుక్కలను మాత్రము వెనుకకు పంపివైచిరి. స్లెడ్జిబండ్లను తామే స్వయముగ

లాగుచు పరిశోధకులు దక్షిణదిశకు సాగిపోజొచ్చిరి. ఈప్రయాణమునందు వీరు సగటున రోజుకు నాల్గుమైళ్ళుమాత్రము పోగల్గెడివారు: భూమియంతయు మెత్తనిమంచుతో కప్పబడి యుండుటవలనను, అనేకప్రదేశములలో అగాధమైనగోతులుండుటవలన వానిని తప్పించుకొనుటకై మిక్కిలి జాగ్రత్తగ తడవుకొనుచు ముందునకు సాగిపోవలసిన కారణమునను, ప్రయాణవేగము మిక్కిలి కుంటుపడెను. మంచుతుపానులు చెలరేగినప్పుడు కొందరికి తాత్కాలికముగ అంధత్వము సంప్రాప్తమయ్యెను. పరిశోధకులందరును ఆకుపచ్చని కంటియద్దముల ధరించుచుండెడివారు. లేనిపక్షమున మంచుప్రవాహము నుండి వెల్వడు అద్భుతతేజముచే చూపరులకు కన్నులుమిరుమిట్లుగొల్పి దృష్టి చెడిపోవును. త్రోవయందు స్కాటుపరిశోధకవర్గమువారు క్రిస్టమస్ పండుగనుకూడ తగువిధముగ జరపిరి. మరుసటి సంవత్సరము పండుగకింటికి చేరి చుట్టుప్రక్కలనున్న పేద బాలబాలికలకు మిఠాయిలు పంచిపెట్టుదమని పరిశోధకులు పలువురు తలంచిరి. అప్పటికి తాముపూనిన ఘనకార్యము విజయవంతముగ సమాప్తమై తామింటికి పోగల్గుదుమని పాపము వారాశచెందిరి. కాని దైవమన్యథా తలంచి యుండెనని వారికెట్లు తెలియును!

1912వ సంవత్సరపు ఉగాదినాటికి పరిశోధకవర్గము వారు పదివేల అడుగుల ఎత్తైన పీఠభూమిని చేరగల్గిరి. వారి ముందు అతి ప్రకాశవంతములైన మంచుమైదానములు వ్యాపించి యుండుట కానవయ్యెను. ఈ ఘట్టము చేరుసరికి స్కాట్ ప్రభృతులకు తమ ప్రయత్నము సఫలముకాగల సుదినము

సమీపించుచున్నదని నమ్మకము కలుగసాగెను. కాని, నార్వే దేశీయుడగు కాప్టన్ అమండ్సన్ కూడ దక్షిణ ధ్రువమును చేరుటకై ప్రయత్నము చేయుచుండుటవలనను, ఆతడు వేరొక మార్గము నవలంబించి స్లెడ్జిబండ్లపై వేగముగ ప్రయాణము చేయుచున్నందునను, గమ్యస్థానము నాతడే తమకంటె ముందుగ చేరగల్గునేమోయని స్కాట్ మున్నగువారు భయ పడసాగిరి. మరి నాల్గుదినములు ప్రయాణము చేయుసరికి దక్షిణ ధ్రువము నూటనలుబది మైళ్ళదూరమున నున్నట్లు తెలియవచ్చెను. కావున పరిశోధకులలో నతి సమర్థులగు నైదు గురుమాత్రము ధ్రువప్రదేశమునకు పోవలయునని నిశ్చయింప బడెను. మిగిలినవారందరును వెనుకకు మరలిపోవలెను. దక్షిణ ధ్రువమును చేరుటకై బయలుదేరినవారు కాప్టన్ స్కాట్, డాక్టర్ విల్సన్ (Doctor Wilson), కాప్టన్ ఓట్స్ (Captain Oates), లెప్టినెంట్ బవర్స్ (Leutenant Bowers), ఈవాన్స్ (Evans) అనువారలు. అతి కష్టముతో కాళ్ళీడ్చుకొనుచు దిన మునకు పదిమైళ్లచొప్పున వీరు తమ ప్రయాణమును సాగించిరి. 1912 జనవరి పదునేనవ తేదీనాటికి వీరు ధ్రువమున కిరువది యేడు మైళ్లదూరమున నుండిరి. ఆనాడు కాప్టన్ స్కాట్ తన దినచర్య పుస్తకమం దిట్లు వ్రాసికొనెను. "మేము ధ్రువమును చేరగల్గుట నిశ్చయము. కాని, మాకంటె ముందే అమండ్సన్ అచ్చటికి చేరియుండునా యనునదియే సమస్య". 16 వ తేదీ నాడు వారికి స్లెడ్జిబండ్ల గుర్తులును, ఒక డేరా పాతబడినట్లు నిదర్శనములును చూపట్టెను. జనవరి పదునేడవ తేదీనాడు స్కాట్ పరిశోధక వర్గమువారు చిరకాలమునుండి తాము

వాంఛించుచున్న దక్షిణధ్రువ ప్రదేశమును చేరగల్గిరి. కాని, అప్పుడు వారికి బ్రహ్మానందమునకు మారు గొప్ప ఆశాభంగము కల్గెను. అచ్చట నార్వేదేశపు జండా ఎగురుచుండెను. సుమారు ఒక నెలకుపూర్వమే అనగా 1911 సంవత్సరము డిసెంబరు 14వ తేదీని నార్వేదేశపు పరిశోధకుడైన అమండ్సన్ దక్షిణధ్రువమును చేరి అచ్చట తనదేశపుజండాను ప్రతిష్ఠించి వెనుకకు మరలిపోయెను. తాను వెడలిపోయినతర్వాత కాప్టన్ స్కాట్ దక్షిణధ్రువమునకు రాగలడని యాతడెరింగియుండెను. కావున అమండ్సన్ కాప్టన్ స్కాట్ పేర ఒక ఉత్తరమును వ్రాసి అచ్చట యుంచిపోయెను. జాబులో నిట్లు వ్రాయబడెను.

"మిత్రులైన కాప్టన్ స్కాట్‌గారికి—నేను వెడలిపోయినతరువాత ఈ ధ్రువప్రాంతమును మీరుమాత్రము చేరగల్గుదురు. కావున నేను వ్రాసిన యీ జాబును దయతో మాదేశపు రాజగు ఏడవ హాకన్‌కు (King Haakon VII) పంపగోరెదను. మే మిచ్చట విడచిపోయిన వస్తువులలో నేవైన మీ కుపయోగకరముగ కాన్పించినపక్షమున వానిని తప్పక వాడుకొనవలెనని కోరుచున్నాను. మేము దిగవిడచిన స్లెడ్జిబండికూడ మీకు పనికివచ్చును. మీరు క్షేమముగ వెనుకకు తిరిగిరాగలరని హృదయపూర్వకముగ కోరుచున్నాను".

నార్వేదేశపు జండా ప్రక్కన యూనియన్ జాక్ (బ్రిటీషు జండా) ను ప్రతిష్ఠించి స్కాట్‌ను, అతని మిత్రులు బరువైన హృదయములతో ఉత్తరాభిముఖముగ వెడలిరి.

స్కాట్ ప్రభృతులకంటె ఒక నెలపూర్వమే దక్షిణధ్రువమును చేరగల్గిన అమండ్సన్ అనునాతడు మరియొక

మార్గము ననుసరించి గమ్యస్థానమును చేరెను. ఈతడు రాస్ సముద్రము నంటియున్న హిమకుడ్యమును తూర్పుభాగమున దాటెను. బ్రిటీషు పరిశోధకవర్గమువారు పశ్చిమభాగమునుండి దాటిరి. అముండ్సన్‌కు త్రోవయందు మంచుప్రవాహము లడ్డు రాలేదు. ఈతడు హిమకుడ్యముపై చాలదూరము ప్రయాణము చేసినందున, సమప్రదేశమునకు దిగుసరి కాతనికి ధ్రువము స్కాట్ ప్రభృతులకంటె కొంచెము సమీపమయ్యెను. అముండ్సన్ గమనవేగముకూడ స్కాట్ వర్గముకంటె హెచ్చుగ నుండెను. ఈ పరిశోధకుడు నైఋతిదిక్కుగ ప్రయాణముసల్పి తుదకు ధ్రువమును చేరగల్గెను.

స్కాట్‌ను, అతని మిత్రులును ధ్రువమునుండి మరలి పోవునప్పుడుకూడ వారికి మంచుతుపానుల బాధ తప్పలేదు. సురక్షితముగ తాము బయలుదేరిన ప్రదేశమునకు చేరుట వారి కొక గొప్ప సమస్యగ పరిణమించెను. త్రోవయం దచ్చటచ్చట ఆహారకేంద్రముల కల్పించుకొనియుండిన కారణమున వారికి భోజనపు కొరతమాత్రము లేకుండెను. తుపానులు చెలరేగినందున వారు కొంతకాలము మధ్యమార్గమున నిలచిపోవలసివచ్చెను. మరికొన్ని దినములతర్వాత వారు, మన మిదివరలో వర్ణించిన మంచుప్రవాహమును చేరగల్గిరి. ఇప్పుడీ ప్రవాహపుటొడ్డుననే ప్రయాణముచేయుచు పదివేల అడుగుల క్రిందికి దిగిపోవలయును. పరిశోధకుల కొక కష్టము వెనుక వేరొక కష్టము సంప్రాప్తము కాజొచ్చెను. స్కాట్‌ను, ఈవాన్సును మంచు గోతులలోపడి యెట్లో ప్రాణముల దక్కించుకొనిరి. ఈవాన్సు పరిశోధకులందరిలోను మిక్కిలి దృఢగాత్రుడు. అయినను యీ పాటువలన బలమైన దెబ్బలు

తగిలి యాతడు బాధపడసాగెను. అత్యంత శీతలపరిస్థితులవలన నాతని దేహ మవశమయ్యెను. హిమప్రవాహమును దాటి దిగువభూమికి వచ్చునరి కాతడు మరణించెను. మిగిలిన నల్గురు పరిశోధకులును దుఃఖభారముతో నాతని కంత్యక్రియలు కావించి ముందునకు సాగిపోయిరి. సాధారణముగ జనవరి, ఫిబ్రవరి నెలలయందు దక్షిణార్థగోళమునందు వాతావరణస్థితి ప్రయాణమున కనుకూలముగ నుండును. కాని, యీ సంవత్సర మట్లుండలేదు. దినదినమును చలిగాలులును, మంచు వర్షమును హెచ్చసాగెను. దినమునకు వారు నాల్గుమైళ్లకంటె హెచ్చుదూరము పోజాలరైరి. కాప్టన్ ఓట్స్ అను నాతనికి కాళ్ళును, చేతులును పక్షవాతరోగికివలె పడిపోయెను. అత్యంత శీతలప్రదేశములలో దేహమును సంపూర్ణముగ కప్పుకొని బయలువెడలినప్పుడు వ్రేళ్ళుకాని, కాళ్ళుకాని, చేతులుకాని యీ విధముగ నిరుపయోగములగుట సామాన్య విషయము. ఆయా అంగములందు రక్తప్రసారము యథాప్రకారముగ నుండకపోయినప్పు డిట్టి యవస్థ సంభవించును. కాప్టన్ ఓట్స్ అతి కష్టముపై తన మిత్రులతోకూడి ఫిబ్రవరి నెలయంతయు ప్రయాణము సాగించెను. కాని దినదినమును తన స్థితి చెడిపోవుచుండుటయు, తనవలన తన మిత్రులకు కష్టము సంభవించుటయు, ఆహారపదార్థములు నానాటికిని, తగ్గిపోవుచుండుటయు గుర్తించి ఆత డొక మహత్తర త్యాగమును కావించుటకు సిద్ధపడెను. మార్చి 17 వ తేదీని కాప్టన్ ఓట్స్ జన్మదినము. ఆ దినమున నాతడు భయంకరముగ చలివీచుచున్న మంచుతుపానులోనికి వెడలిపోయి సంతోషపూర్వక

ముగ మృత్యువు నాలింగనము చేసికొనెను.

హతశేషులైన స్కాట్, డాక్టర్ విల్సన్, బవర్సు గారలు నిస్సత్తువతోడను, ఆకలిచేతను, శీతలబాధచేతను మిక్కిలి పీడింపబడుచు తమ ప్రయాణమును సాగించిరి. మార్చి 21 వ తేదీనాటికి వారు మంచుటెడారియందలి ఒక ఆహార కేంద్రమును సమీపించిరి. పదునొకండు మైళ్లదూరమున నెలకొనియున్న ఈ కేంద్రమునం దొక టన్ను ఆహారపదార్థ ములు నిక్షిప్తములై యుండెను. ఇచ్చట పరిశోధకవర్గమున కావశ్యకమైన అన్ని వస్తువులునుకూడ లభింపగలవు. కాని, యీ స్వల్పదూరమునుకూడ గడచుటకు వారి కవకాశము లభింపలేదు. ఏడుదినము లహోరాత్రములు మహా భయంకర మగు మంచుతుపాను చెలరేగెను. పరిశోధక వర్గమువారు తమ డేరానుండి బయటకు కాలుపెట్టుటకుకూడ సాధ్యము కాలేదు. ఈ ప్రళయమారుతము శాంతించుసరికి స్కాట్, విల్సన్, బవర్సులు నిరాధారులై ఆ మంచుటెడారిలో దీర్ఘ నిద్రచెందిరి. ఎట్టి కష్టములకును, అపాయములకును జంకని వారిధీరహృదయము లేమహత్తరశక్తియందో విలీన మయ్యెను.

కొన్ని నెలలు గడచిపోయెను. అప్పుడు ఈవాన్సు అగ్రమునుండి కొందరు ఆంగ్లేయులు, పరిశోధకవర్గము వారి స్థితి యెట్లున్నదో తెలిసికొనవలయునని వారిని వెదకుచు బయలుదేరిరి. స్కాట్ ప్రభృతులు మరణించిన డేరా వారి కగుపడెను. కాని అదిమంచుచే ఇంచుమించు సంపూర్ణముగ కప్పివేయబడియుండెను. మృతదేహములప్రక్కన వారి దిన

చర్య పుస్తకములు పడియుండెను. వాని సహాయమున పరిశోధకులకు సంభవించిన ఆపదలును, తుదకు వారు మరణించుటయు తెలియవచ్చెను. పరిశోధకవర్గమునకు నాయకుడును, ధీరాగ్రేసరుడునగు కాప్టెన్ స్కాట్ తనదినచర్య పుస్తకమునం దిట్లు వ్రాసెను—

"ఇట్టి ప్రయాణమునకు పూనుకొనినందులకు నాకింతయైనను విచారము లేదు. ఆంగ్లేయులు కష్టముల సహింపగలరనియు, అన్యోన్య సహాయము కావించుకొనగలరనియు, ప్రాచీనకాలపు వీరులెట్లు నిర్భయముగ మృత్యువు నెదుర్కొనిరో అట్లే ధైర్యముతో నేటి ఆంగ్లేయులు మరణము నెదిరింపగలరనియు దీనివలన స్పష్టముకాగలదు. మేము నేక ప్రమాదములను బుద్ధిపూర్వకముగ నెదుర్కొంటిమి. దాని వలన మా ప్రాణముల కపాయము సంభవింపగలదనియును మాకు తెలియును. పరిస్థితులు మాకువిరుద్ధగతి ననుసరించినవి. అయినను మేమందులకు విచారింపము. భగవదాజ్ఞకు తల యొగ్గి, కొనయూపిరి ఉన్నంతవరకును మేమునూక ర్తవ్యమును నెరవేర్చెదము."

ధీరులైన ఈ పరిశోధకుల శవములను ఈవాన్సు అగ్రమునకు తీసికొనివచ్చి మిత్రులు వారిజ్ఞాపకార్థమొక సమాధి నేర్పాటుచేసిరి. ఆ సమాధిపై ఇట్లు వ్రాయబడెను—

"కాప్టెన్ రాబర్ట్ ఫాల్కన్ స్కాట్, డాక్టర్ విల్సన్, కాప్టెన్ ఓట్స్, లెఫ్టినెంటు బవర్సు, ఇ. ఈవాన్సుగార్ల జ్ఞాపకార్థము. వీరు దక్షిణధ్రువమునుండి తిరిగివచ్చుచు మార్చి 1912 వ సంవత్సరమున మరణించిరి. వీరి ఆదర్శము ఈదిగువ

నొసంగబడినది.

"నిరంతరము కృషి సల్పుము.
నిరంతరము సన్వేషింపుము.
సత్యమును కనుగొనుము.
కష్టపరంపరలకు జంకకుము."

---

## ప్రశ్నలు

1. దక్షిణ ధ్రువముచేరుటకై సర్ డగ్లస్ మాసన్ కావించిన యత్నమును వర్ణింపుము.

2. అంటార్కిటిక్ భూఖండమునుగూర్చి జేమ్సు క్లార్కురాస్, ఎర్నెస్ట్ షాకిల్టన్‌గార్లు కనుగొనిన విశేషములేవి?

3. కాప్టన్ రాబర్ట్ ఫాల్కన్ స్కాట్ జీవితమును గూర్చియు, ఆతడు దక్షిణధ్రువమును కనుగొనిన సాహస ప్రయత్నముల గూర్చియు, నీకేమి తెలియును?

4. ఉత్తరధ్రువ పరిశోధనము, దక్షిణధ్రువ పరిశోధనము - వీని యందుగల భేదసామ్యముల తెల్పుము.

5. ధ్రువప్రాంతముల పరిశోధించుటవలన మనము సాధింపగల్గు, ఆర్థిక, నైతిక, వైజ్ఞానిక ప్రయోజనముల వివరింపుము.

---

# 4. పర్వతరాజుతో యుద్ధము

హిమాలయము పర్వతరాజమని యెల్లవారు నంగీకరించియున్నారు. ప్రపంచమందలి మరే పర్వతమును దీనితో పోల్చుటకు వలనుపడదు. ఔన్నత్యమునందు దీని కిదియే సాటి. హిమాలయ శిఖరములలో మిక్కిలి యెత్తైన గౌరీశంకర శిఖరము అయిదుమైళ్ళకు మించిన యెత్తుగలదై ఆకాశముతో నెకసక్కెములాడుచుండును. హిందూదేశమున కిది ప్రకృతినిర్మితమగు దుర్గరాజము. ఆర్యావర్తమునకు తన దివ్యజలములచే జీవనమొసగు నదీరాజముల కిది జన్మభూమి. మహాకవియైన కాళిదాసు యీ పర్వతరాజమును "అనంతరత్నప్రభవ" మని కీర్తించియున్నాడు. ప్రకృతి సౌందర్యమునకును, గంభీరతకును, నిశ్చలత్వమునకును హిమాలయము ఉత్తమ నిదర్శనము. కేవలప్రాకృత దృష్టితో నుపలక్షించువారికి పై విషయములు మాత్రము తెలియవచ్చును. కాని, భక్తివిశ్వాసములతో చూచువారి కితరవిషయము లనేకములు గోచరించును. హిమాలయము సామాన్య పర్వతము కాదు. అయ్యది దేవతానివాసమైన పుణ్యక్షేత్రము. నిత్యయౌవనులును, శృంగారజీవిత ప్రియులునగు దేవగణములు, యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుషులీ నగాధిరాజముపై యెల్లప్పుడును విహరించుచుందురు. మహాతపస్సంపన్నులగు సంయమీంద్రుల కిది నిత్యనివాసము. ఈ పర్వతశ్రేష్ఠమున కధిదైవమగు హిమవంతుడు మహాపుణ్యాత్ముడు. లోకజనని

ష్టమైన కాత్యాయనీదేవి యీతని పుత్రిక. ఈ ధన్యాత్ముడు జగద్వంద్యుడగు చంద్రశేఖరుని తన జామాతగ కావించు కొనెను. భక్తసులభుడైన ఈశ్వరుడు భార్యతోడను, పుత్రుల తోడను, నిరంతరము తన్ను సేవించుచుండు ప్రమథగణముల తోడను శ్వశురగృహమందే యెల్లప్పుడును నివసించును. వెండికొండయగు కైలాసము పార్వతీపరమేశ్వరుల నివాస స్థానము. హిమాలయాగ్రమగు గౌరీశంకర శిఖరముపై వారు కొలువుతీర్చియుందురు. ప్రాచీన భారతీయ సంప్రదాయమునందు విశ్వాసము కలవారందరు నీ యంశముల నమ్ముదురు. ఇట్టివారీ యిరువదవ శతాబ్దియందు సైతము పలువురు కలరు. దేవతలకు విహారభూమియు, తపస్సంపన్నులకు పుణ్యక్షేత్రమును, జగత్పితరులగు నుమామహేశ్వరులకు కొలువుకూటమునగు హిమాలయమును అత్యంత వినమ్రభావముతో మాత్రమే భారతీయుడు సమీపింపగలడు. ఇతర పర్వతములతోపాటు హిమవన్నగమును సామాన్య పర్వతముగ భావించుట దేవతలయెడ తీరని యపరాధము కావించుటయే. మృత్యుంజయునికి కాణాచియైన కైలాసపర్వతము నధిరోహింపబూనుట మహాపచారమే కాక, కోరికోరి మృత్యువు నాహ్వానించుటవంటిది. ఇట్టి భావములు కలవారగుటవలననో, మరే కారణముననో కాని చారిత్రకయుగము నందు భారతీయు లెవ్వరును కైలాసమునకు పోవు సాహస ప్రయత్నము కావింపలేదు. పురాణయుగమందు నారదాది మహర్షులు తమ తపశ్శక్తి ప్రభావమున కైలాసమునకు వచ్చుచు పోవుచుండినట్లు, ప్రాచీన గ్రంథములు తెల్పుచున్నవి.

అనేక శతాబ్దములు గడచినవి. దైవనిర్ణయము ననుసరించి పుణ్యభూమియైన యీ భరతఖండము పాశ్చాత్యులగు నాంగ్లేయుల పరిపాలనలోనికి వచ్చెను. పాశ్చాత్యులు నిరీశ్వరవాదులు కారు. జడప్రకృతియందు భగవంతుడు లీనమైయుండునే కాని సాకారముగ నివసించునని వారు నమ్మరు. ప్రకృతి పరమేశ్వరుని రూపాంతరము. కావున దానిని పరిశోధించి, అందలి రహస్యముల తెలిసికొనుట పరమేశ్వరుని నిజస్వరూపమును కనుగొని పూజించుటయే కాని ఏ విధముగను భగవంతుని కపచారము కానేరదు. ఈ విధమగు హేతువాదమునందు విశ్వాసముకలవారు కావున ఆంగ్లేయులు హిమాలయ పర్వతమును పరిశోధించుటకును, దాని యగ్రమును చేరుటకును వెనుదీయలేదు. అనేక యుగములలో సామాన్య భారతీయులు కావింపని ఘన కార్యమునకై విదేశీయులగు ఆంగ్లేయులు పూనుకొనిరి. సాహసులును, ఉత్సాహవంతులును, పర్వతారోహణ నిపుణులును అగు కొందరాంగ్లేయులు యీ శతాబ్ది యారంభమున హిమాలయాగ్రమును చేరుటకై యత్నించి విఫలమనోరథులైరి. ఈ ప్రయత్నమునందు కొందరు తమ ప్రాణముల గోల్పోయిరి. తుదకు 1930 నందు కొందరు ధీరులు విమానములలో గౌరీశంకర శిఖరమును సమీపించి, అచ్చటి విశేషముల సందర్శింపగల్గిరి. ఈ సాహసకృత్యముల కొంచెము వివరముగ మనము తెలిసికొందము.

ఆంగ్లప్రభుత్వము భారతదేశమున సుస్థిరముగ నెలకొనినతర్వాత, వారీదేశమును సమర్థులైన శాస్త్రజ్ఞులచే పరీక్షింపచేసిరి. శాస్త్రజ్ఞులలో కొందరు సుమారు నూట

యేబది మైళ్ళదూరమునుండి హిమాలయ శిఖరముల పరీక్షించి వానిలో నత్యున్నతమగు శిఖరము సుమారు 29000 అడుగుల యెత్తుగనున్నదని తమవద్దగల శాస్త్రీయ సాధనములచే నిర్ణయించిరి. ఈకాలమున భారతప్రభుత్వము వారివద్ద సర్వేయర్ జనరల్ (Surveyor General) గా పనిచేయుచున్న శాస్త్రజ్ఞుడు కల్నల్ ఎవరెస్ట్ (Colonel Everest) అనునాతడు. అతని గౌరవార్థము హిమాలయమందలి అత్యున్నత శిఖరము ఎవరెస్టు శిఖరమని పిలువబడెను. భారతీయప్రపంచమున నీ శిఖరమునకు గౌరీశంకర శిఖరమని పేరు.

గౌరీశంకర శిఖరమును చేరుటకై చిరకాలమువరకును ప్రయత్నములు కావింపబడకుండుట కనేక కారణములు కలవు. ఈ పర్వతము మహోన్నతమైనది. సామాన్యులకిది సమీపించుటకుకూడ సాధ్యముకానిది. ఇవి ప్రకృతిసిద్ధమైన యాటంకములు. మానవులు కల్పించిన యవరోధములు మరికొన్ని కలవు. గౌరీశంకర శిఖరమునుచేరుటకై సరియైనమార్గము టిబెట్టు దేశములోనుండి కలదు. ఈ శిఖరమున కుత్తరభాగమునందుగల భూమి టిబెట్టు ప్రభుత్వమువారిది. దక్షిణప్రాంతము నేపాళప్రభుత్వమునకు చెందినది. నేపాళరాజ్యమునకు రాజధానియైన ఖట్మండునగరము ఎవరుస్టు శిఖరమునకు నూరు మైళ్ళ దూరముననున్నది. ఇటీవలవరకును టిబెట్టుపాలకుడైన దలైలామా విదేశీయులు తమదేశమున నడుగుపెట్టుటకెంత మాత్రము నంగీకరించెడి వాడుకాడు. కాని 1920 వ సంవత్సరమందు టిబెట్టుపాలకుడీ కఠిననిర్బంధముల సడలించి, పాశ్చాత్యులు తన దేశములోనుండి ప్రయాణముచేసి ఎవరెస్టు

శిఖరమును చేరుటకై అనుమతినొసంగెను. అతికష్టముపై సాధింపబడిన యీ అవకాశమును వినియోగపరచుకొని ఎవరెస్టు శిఖరమునుచేరుటకై కొందరు పాశ్చాత్యులు ప్రయత్నించిరి. రాయల్ జాగ్రాఫికల్ సొసైటీ, ఆల్ప్స్ క్లబ్ (Alpine Club) అను రెండుసుప్రసిద్ధ పరిశోధకసంఘములవారీ యత్నములకు చేయూతనొసంగిరి. నూతనప్రదేశములు కనుగొనుటయందును, దుష్ప్రాప్యములగు పర్వతములధిరోహించుట యందును వీరు సాహసులగువారిని ప్రోత్సహించెడివారు.

ఎవరెస్టు శిఖరమును చేరదలచినవారు మొదట అతిగహనములగు కారడవులగుండ ప్రయాణము చేయవలయును. ఇచ్చట సంభవించు కష్టములు వర్ణనాతీతములు. నీనికితోడు పరిశోధకులు తమకు కావలసిన భోజనపదార్థములు, దుస్తులు, డేరాలు, ఇతరసాధనసామగ్రి మున్నగువానిని పర్వతపాదము నుండియే తమతో తీసికొనిపోవలెను. పర్వతముపై నొకకట్టె పుల్లకూడ లభ్యముకాదు. భూమినివిడచి ఉన్నతోన్నతప్రదేశములకు పోయినకొలదియు వాతావరణము పలుచబడును. ఆకారణమున పర్వతారోహకుల కొకప్రత్యేకమగు కష్ట మేర్పడును. భూమిపై మిక్కిలికష్టించి పనిచేసినను అలసిపోవని బలాఢ్యుడు సైతము పర్వతాగ్రములపై కొలదికాలములో శ్రమచెందును. అచ్చట మానవుని కావశ్యకమగునంత ప్రాణవాయువు లభింపకపోవుటయే దీనికి కారణము. 1880 వ సంవత్సరమునకు పూర్వము జనులయందొక తప్పు అభిప్రాయము వ్యాపించియుండెను. మూడున్నరమైళ్ళకు మించిన యెత్తుగల పర్వతములపై మానవ జీవితమునకు కావశ్యకమగు

గాలి యుండదనియు, ఆకారణమున నంతకుమించిన యెత్తు ప్రదేశములకుపోవుట అసాధ్యమనియు పలువురు తలంచుచుండిరి. కాని 1883 వ సంవత్సరమున గ్రాహామ్ (Graham) అనుధీరుడు 24000 అడుగుల యెత్తుగల కాబ్రూ (Kabru) పర్వతము నెక్కి పైయభిప్రాయము నిజముకాదని ఋజువు చేసెను. ఈ కాబ్రూ పర్వతము హిమాలయములో నొక భాగము. ఎవరెస్టు శిఖరమును చేరదలంచు వారికనుకూలమగు సమయముకూడ మిక్కిలి పరిమితముగ లభించును. సంవత్సరములో రెండు నెలలు మాత్రమే యీ పర్వతారోహణమున కనుకూలమగు ఋతువు. ఇంచుమించు మార్చి నెల తుదివారమువరకును టిబెట్టు సమీపమందలి కనుమల యందును, పర్వతాగ్రముపైనను శీతలబాధ భరింప శక్యముగాకుండనుండును. జూను మొదటివారమునందు వర్షఋతువు ప్రారంభమగుటవలన పర్వతములపై ప్రచండమారుతము, చెలరేగి కుంభవృష్టిగ వర్షములు ప్రారంభించును. కావున ఏప్రిలు, మే రెండు నెలలయందే హిమాలయ పర్వతము నెక్కుటకు ప్రయత్నింపవలయును.

గౌరీశంకర శిఖరమును చేరుటకై కావింపబడిన మొదటి ప్రయత్నము బ్రిగేడియర్ జనరల్ సి. జి. బ్రూస్ (Brigadier General C. G. Bruce) అను ఆంగ్లేయుని నాయకత్వమున కావింపబడెను. ఈ గురుతర బాధ్యతను వహించుట కితని కంటె సమర్థతరుడు లభించుటదుర్లభము. పర్వతారోహణము నందితనికి మిక్కిలి అనుభవముగలదు. సుమారు ముప్పది సంవత్సరములాతడు యూరోపుఖండములోని ఆల్ప్సు (Alps)

పర్వతములపైనను, మనదేశమందలి హిమాలయముపైనను సంచరించి అపారమైన సామర్థ్యమును సంపాదించియుండెను. భారతీయ సేనలోని గోరక్షక (ఘూర్కా) విభాగములోకుండ ఆతడు ముప్పదిసంవత్సరము లుద్యోగిగనుండినందున ఆతనికి గోరక్షకులతో మిక్కిలి పరిచయముండెను. వారిభాషనుకూడ ఆతడు ధారాళముగ మాట్లాడగల్గియుండెను. బ్రూస్ సేనాని నేపాలదేశము, టిబెట్టుదేశముల ప్రజలను, వారి మతవిశ్వాసములు, నమ్మకములు మున్నగువానిని చక్కగ తెలిసికొనియుండెను. బ్రూస్ సేనాని సహాయార్థమై మరియొక సైనికోద్యోగియు, ఒక వైద్యుడును, ఒక ప్రకృతిశాస్త్రజ్ఞుడును, ఒకచిత్రకారుడును నియమితులైరి. వీరందరును పర్వతారోహణమునకై బయలుదేరు పరిశోధకసంఘమువారి కావశ్యకములగు అన్నిసదుపాయములను కావింతురు. ఎవరెస్టు శిఖరమునుచేరుటకై ముందంజవేసినవారు మెలోరీ (Mallory), కాప్టెన్ ఫించ్ (Captain Finch), మేజర్ నార్టన్ (Major Norton) డాక్టర్ సోమర్‌విల్ (Dr. Somervell), డాక్టర్ వేక్‌ఫీల్డ్ (Dr. Wakefield) అనువారలు. వీరి కావశ్యకములగు వస్తుజాలము నాయాస్థానములకు పంపుటకై మరియొకఉద్యోగి నియమింపబడెను. వీరిలో మెలోరీఅను నాతడింతకుపూర్వమే హిమాలయముపై సంచారముచేసి అచ్చటి పరిస్థితులగూర్చి అనేకవిషయములు తెలిసికొనియుండెను. ఈ పరిశోధకులతోకలసి పర్వతారోహణము కావింపవలసిన కూలీలను బ్రూస్‌సేనాని స్వయముగపరీక్షించి నియమించెను. వారందరును ఉక్కుతునకలవంటివారు. ఈ పరిశోధకసంఘ

మువారి భోజన సదుపాయమునకై పాకకళయందారితేరిన వంటవాండ్రు నియమింపబడిరి. పర్వతముల నెక్కుట మిక్కిలి కష్టమైనపని. అందు పాల్గొనుచున్నవారికి బలకరమును, పరిశుభ్రమునైన ఆహారము లభింపవలెను. లేనియెడల వారి ఆరోగ్యము చెడిపోవును.

1922 వ సంవత్సరము ఏప్రిలునెలయందు వీరు టిబెట్టు దేశమును చేరిరి. అచ్చట సముద్రమట్టముకంటె 14,000 అడుగుల ఎత్తుగల మైదానముపై ప్రయాణముచేసి, చలి బాధచే వడవడ వడకుచు హిమాలయ పాదమును చేరిరి. ఆ ప్రదేశమునుచేరుసరికి వారితో సుమారు అరువదిమంది టిబెట్టు కూలీలును, మూడునూర్ల భారవాహక జంతువులు నుండెను. తమకు కావలసిన పిండి, ధాన్యములు, మాంసము మున్నగు సమస్త వస్తువులునుకూడ వారు నలుబదిమైళ్ళ దూరముననున్న గ్రామములనుండి తెచ్చుకొనిరి. ఈ పరిశోధకులు చూచిన తుట్టతుది జననివాసము రాంగ్‌బక్ అను ప్రదేశమందలి మఠము. ఎవరెస్టు శిఖర మచ్చటికి మిక్కిలి సమీపముననున్నట్లు కాన్పించును. కాని, నిజమున కది పదునారు మైళ్ళదూరమున నుండెను. మఠాధికారి పరిశోధక వర్గమువారిని తనతోపాటు తేనీటిని గ్రోలవలసినదిగా కోరెను. ఈ ప్రాంతమందలి టిబెట్టుదేశీయులు తేనేటియందు పాచి పోయిన వెన్నను, ఉప్పును కలిపి సేవింతురు. అట్టి కఠోర పానీయమును త్రావుట కిష్టములేక బ్రూస్ సేనాని ఎవరెస్టు శిఖరము సాధింపబడువరకును తాను తేనీటిని త్రాగనని శపథము పూనినట్లు అసత్యము పల్కి తప్పించుకొనెను. ఎవ

రెస్టు శిఖరమును చేరు ప్రయత్నము తనకొక తీర్థయాత్రయని తెల్పి బ్రూస్ సేనాని మఠాధికారి మనస్సునందలి అనుమానమును పారద్రోలెను. అది విని సంతోషించి, శ్రోవయం దెట్టి మృగములను వేటాడరాదని వారికి బోధించి మఠాధికారి పరిశోధకులను వీడ్కొల్పెను.

అచ్చటి కనతిదూరమున అనగా సముద్రమట్టముకంటె 16,500 అడుగుల ఎత్తైన ప్రదేశముపై పరిశోధకులు తమ ఆది స్థావరమును కల్పించుకొనిరి. ఇచ్చట నిప్పుచేయుటకు కట్టెలు దొరకవు. యాక్ మృగములనుండి లభించిన పిడుకలు వారి కిప్పుడు గతియయ్యెను. అచ్చట నీరంతయు గడ్డకట్టి యున్నందున మంచుగడ్డలను కరగించి వారు తేనీటిని సిద్ధము చేసికొనిరి. తమకుగల వ్యవధి చాల తక్కువగ నున్నందున పరిశోధకులు చురుకుగ ప్రయాణముసాగించి 17800, 19800, 21000 అడుగుల ఎత్తున వేరువేరు స్థావరముల నెలకొల్పి, శిఖరమును చేరుటకై యత్నములు కావింపసాగిరి. ఈ ప్రయత్నమున పాల్గొనినవారు మెలోరీ, సోమర్ విల్, మార్షెడ్ (Morshead), న్యూటన్ (Newton) అను వారలు. వీరు 25,000 అడుగుల ఎత్తువరకును సాగిపోయి అచ్చట ఒక రాత్రిని గడపిరి. మరునాడు వారు 26,985 అడుగుల ఎత్తునకు పోగల్గిరి. పర్వతారోహణము వారి కెంతయో శ్రమ కల్గించెను. తరచు వా రచ్చటచ్చట విశ్రమింపవలసివచ్చెను. కాని, ఊపిరిపీల్చుటకై వారికి కృత్రిమ సాధనముల ఆవశ్యకత కాన్పింపలేదు. పరిశోధకుల కాయాసముతోపాటు, తలదిమ్ము, గొంతుకనొప్పి మున్నగు స్వల్పమైన

బాధలు కలుగసాగెను. కాని, వారి యారోగ్యమే విధము గను చెడిపోలేదు. నిస్సత్తువయు, చలిబాధయు తీవ్రముగ నున్నందున పరిశోధకు లచ్చటినుండి వెనుకకు మరలివచ్చిరి. ఎవరెస్టు శిఖరమువరకును పోవుట అసాధ్యకార్యము కాదు. అగ్రమువరకునుకూడ మనుష్యులు నడచిపోవుటకు తగినంత విశాలమైన త్రోవగలదు. కాని, ఎంతటి బలాఢ్యులకును, అనుభవశాలులకునుకూడ ఆ దూరము నడచుటయు, అంతటి ఎత్తునకు పోగల్గుటయు మిక్కిలి కష్టసాధ్యము. పర్వతముపైకి పోయినకొలదియు మన కన్నహితవు నశించును. ద్రవపదార్థములును, తీపివస్తువులమాత్రము మనము కష్టముపై మింగ జాలుదుము. కాని, యీపాటి ఆహారము పర్వతారోహణమున కావశ్యకమగు సత్తువ నొసంగజాలదు. పర్వతాగ్రములపై వీచు చలిగాలి మిక్కిలి బాధాకరమైనది. ఇచ్చట ఉన్ని బట్టలు ధరించిన చాలదు. ఉన్నిబట్టలపై గాలినికూడ చొరనీయని వేరు పరిధానమును వాడుట మిక్కిలి అవసరము. అట్లు చేయనివారికి దేహమున రక్తప్రసారము కుంటువడి తాత్కాలికముగ పక్షవాతము సిద్ధించును.

మే నెల 20 వ తేదీని కాప్టెన్ ఫించ్, కాప్టన్ బ్రూస్ అను ఆంగ్లేయులును, కొందరు ఘూర్కాలునుకలిసి పర్వతారోహణమునకై మరల యత్నించిరి. ఈ పర్యాయమువారు ప్రాణవాయువుతో నింపిన గొట్టముల తమతో కొనిపోయిరి. కాని 25000 అడుగులకుమించిన మెత్తు ప్రదేశమున గంటకు నాలుగునూర్ల అడుగులకంటె హెచ్చుగ ప్రయాణముచేయుట సాధ్యముకానందున 27235 అడుగుల ఎత్తువరకును మాత్రము

పోయి, అత్యంత పరిశ్రాంతులై వారు తిరిగివచ్చిరి. అప్పటికి వర్షఋతువు సమీపించుచుండెను. వాతావరణ మింకను చెడిపోయెను. మంచు దట్టముగ కురియసాగెను. అయినను లక్ష్యముచేయక సోమర్ వెల్, క్రాఫర్డ్, మెలోరీ అను ముగ్గురు ఆంగ్లేయులును, కొందరు కూలీలునుకూడి పర్వతారోహణమునకై మరల బయలువెడలిరి. 26000 అడుగుల ఎత్తుపై పర్వతమునందొకచోట మరియొక స్థావరమును నిర్మించుకొని అచ్చట ఆహారపదార్థములు, ప్రాణవాయువు మున్నగువానిని నిలువచేసికొని, అనుకూల సమయమున నొక్కబిగిలో పర్వతాగ్రమును చేరవలెనని వారి ఆశయము. మంచు విస్తారముగ కురిసినందున వారికి ప్రతిక్షణమును కాళ్లు దించుకొని పోసాగెను. మధ్యాహ్నము రెండుగంటలు కావచ్చుచుండగా పరిశోధకులకు రాళ్లు సిండియగుచున్నట్లుగ ఏదో ఒకశబ్దము వినిపించెను. వారికెదురుగనున్న మంచు ప్రదేశము బీటలుతీసెను. ఏమి జరుగుచున్నదో ఆలోచించుటకుకూడ అవకాశము లభింపకపూర్వమే వారందరు నొక మంచు ప్రవాహములోపడి కొట్టుకొని పోవుచుండిరి. అదృష్ట వశమున వారందరును ఒకేత్రాటితో తమ్ముతాము బంధించుకొని యుండిరి.

మంచు ప్రవాహపుటలలు వారి నడకత్రోలో పోకను వలె, నొక్కివేయసాగెను. క్షణకాలము మెలోరీప్రవాహములో మునిగిపోయెను. కాని మరుక్షణమున తలయెత్తి చూచునరికాతనికి మంచుప్రవాహ మాగిపోయినట్లు తెలియ వచ్చెను. మిగిలిన యిరువురు ఆంగ్లేయులునుకూడ ఆ హిమ

సమాధినుండి యెట్లో బయటపడగల్గిరి. కాని కూలీలుమాత్ర మిట్టి యదృష్టమునకు నోచుకొనలేదు. వారందరును ప్రవాహమునకు నడుమచిక్కుకొనుటవలన, మంచునది యురవడి వారిని తీవ్రవేగమున కొట్టివైచి సుమారు అరువదిఅడుగుల ఎత్తైన రాతిపై నుండి క్రిందికిపడద్రోసెను. కూలీలలో నలువురు మాత్రము ప్రాణముల కాపాడుకొనగల్గిరి. మంచులోపాతుకొని పోయియున్న యిరువురుకూలీల నాంగ్లేయులు కష్టముపై పైకిల్లాగగల్గిరి. వీరిలో నొకడరువది యడుగుల యెత్తునుండి క్రిందకుపడి తలక్రిందుగ మంచులోపూడిపోయెను. ఏడుగురు సేవకులు ప్రాణములగోల్పోయిరి. ఈ భయంకరప్రమాదము సంభవించినవెనుక ముందునకుసాగిపోవుట కెవ్వరికిని మనస్కరింపలేదు. కావున మరణించినవారి గౌరవార్థమొకసమాధిని కల్పించి, హతశేషులగు సేవకులతో పరిశోధకులు వెనుకకు మరలివచ్చిరి. అప్పటికి వర్షఋతువుకూడ ప్రారంభమైనందున పర్వతమునెక్కుట కికయెంతమాత్రము నవకాశములేదు. ఈ విషయమును గుర్తించి వారు క్రమక్రమముగ పర్వతమును దిగివచ్చిరి. చాలదినములకు వారికి పచ్చనిగడ్డియు, కంటికింపైన పూవులును కాన్పింపసాగెను. మరల ప్రపంచమున ప్రవేశించుచున్నందుల కానందముతో వారిహృదయములు తాండవించెను.

గౌరీశంకర శిఖరమును జయించుటకై మరియొక ప్రయత్నమును చేయుటకై పరిశోధకవర్గము వారు నిశ్చయించిరి. కాని, మరిరెండు సంవత్సరములవరకును అనగా 1924 వరకును యీ యాశయములు కార్యరూపమును

దాల్చలేదు. ఈ పర్యాయముకూడ బ్రూస్ సేనానియే సర్వసన్నాహములును కావించెను. ఈ పరిశోధక వర్గమునందు మెలోరీ, సోమర్ వెల్, కల్నల్ నార్టన్, కాప్టన్ బ్రూస్ అను వారును, ఓడెల్ (Odell) అను భూగర్భశాస్త్రజ్ఞుడును పాల్గొనిరి. ఓడెల్ ప్రాణవాయువు నుపయోగించుటయందు ప్రత్యేక నైపుణ్యము గలవాడు. ఆండ్రూ ఇర్విన్ (Andrew Irvine) అను ఇరువదిరెండేండ్ల యువకుడుకూడ వీరి ప్రయత్నములలో పాల్గొనుట కుత్సహించి పరిశోధకవర్గములో చేరెను. ఈతడు ఆక్స్ఫర్డు (Oxford) విశ్వవిద్యాలయమునందు పడవల పోటీలలో గొప్ప ప్రఖ్యాతిని గడించినవాడు. పర్వతారోహణమునందు విశేషానుభవముగల మరియొక ఆంగ్లేయుడు సైతము వీరి ననుసరించెను.

పర్వతముల నెక్కు సందర్భమున వాతావరణ మనుకూలముగ నుండుట మిక్కిలి ఆవశ్యకము. వాతావరణస్థితి చక్కగనున్న యెడల పర్వతముల నెక్కువా రుత్సాహముతో శీఘ్రముగా ముందునకు పోవగల్గుదురు. వారి కెట్టి ప్రత్యేకమైన శ్రమయు కానరాదు. కాని వాతావరణస్థితి చక్కగా లేనిపక్షమున పరిశోధక యత్నమునందలి ప్రథమ దశలోనే వారి జవసత్వములు వినియోగమైపోవును. ప్రచండ మారుతముతోడను, దుర్భరమగు చలిబాధతోడను పోరాడుటయందే వారి శక్తిసామర్థ్యము లుడిగిపోవును. పర్యవసానము వారికి పరాజయము కల్గును. 1922 వ సంవత్సరమున బయలుదేరిన పరిశోధకవర్గమువారికి కష్టములు కలుగక పోలేదు. కాని, యీ పర్యాయము హిమాలయ శిఖరమును

సాధించుటకై బయలువెడలినవారు కష్టపరంపరను వెంట బెట్టుకొని తమ యుద్యమమును ప్రారంభించినట్లు కానన య్యెను. వీరి ప్రయాణము మొదలుకాగానే తుపాను ప్రారంభమయ్యెను. మంచువిస్తారముగ కురియజొచ్చెను. భరింప శక్యముగాని చలిబాధ మొదలయ్యెను. అయినను పరిశోధకులు తమ ప్రయత్నములు మానలేదు. పర్వతపాద మును చేరుటతోడనే వారు తమ స్థావరములను నిర్మించు కొనుట ప్రారంభించిరి. 21,000 అడుగుల యెత్తునకు పోయిన తరువాత వారు మూడవ స్థావరమును నెలకొల్పసాగిరి. మంచు తుపాను ప్రారంభమై డేరాలలోనికి మంచు కొట్టు కొని రాసాగెను. కాని, అదృష్టవశమున డేరాలుమాత్ర మెగిరిపోలేదు. ఇట్టి పరిస్థితులలో వంటచేయుట ఇంచుమించు అసంభవము. ఇంత ఎత్తైన ప్రదేశములలో నీరు మరగుచున్న ప్పుడుకూడ అందు తగినంత వేడియుండదు. సలసల కాగు నీళ్ళలో చేతులుపెట్టినను కాలవు. రాత్రి నిద్రించునప్పుడు వారందరునుకూడ ప్రత్యేకముగ చేయబడిన సంచులలో దూరి నిద్రించుచుండిరి. కాని, కాలికి ధరించిన బూట్లనుకూడ చక్కగ జాగ్రత్తపెట్టుకొనవలసివచ్చెను. లేనిపక్షమున నవి కొయ్యబారి మరునాడు నిరుపయోగమగును. కావున పరి శోధకవర్గమువారు వానినే తలగడగ వాడుకొనసాగిరి. తుపాను సంరంభము క్రమముగా తగ్గుటకు మారు హెచ్చ సాగినందున వారు వెనుకకుమరలి రెండవ స్థావరమునకు పోవ లసినవారైరి. ఆ సందర్భములో కొందరికి నేత్రావరోధము కల్గెను. మరికొందరికి తాత్కాలికమగు పక్షవాతము సంభ

వించెను. ఒకరికి తీవ్రమైన న్యూమోనియా జ్వరము ప్రారంభ
మైనందున ఆతనిని మరల పర్వతపాదమునకు తీసికొనిపోయిరి.
ఈ విఘ్నములవలన పరిశోధకుల అమూల్యమైన కాలము
చెడిపోయెను.

మే నెల పదవ తేదీని వాతావరణస్థితి బాగుపడినందున
పరిశోధకులు తమ ప్రయత్నముల మరల ప్రారంభించిరి. మరి
పది దినములలో వారు మూడవ స్థావరమును చేరి ముందు
నకు సాగిపోవుటకై ప్రయత్నములు కావింపసాగిరి. మొదట
వారిలో కొందరు 23,000 అడుగుల యెత్తువరకున్న పగల మార్గ
మును పరిశీలించివచ్చిరి. కాని, ఈ పర్యాయముకూడ వారిని
దురదృష్ట దేవత వెన్నంటెను. తుపానుగాలియు, శీతలబాధయు
మరియొక పర్యాయము విజృంభించెను. మోర్షెడ్, సోమర్
వెల్ అనువారికి చలిబాధవలన గొంతుకలు పట్టెను.
మూటలు మోసికొనివచ్చుచున్న కూలీలుకూడ మిక్కిలి
అలసిపోయిరి. ఈ అననుకూలపరిస్థితిని గుర్తించి పరిశోధకులు
మరియొక పర్యాయము వెనుకకు తిరిగివచ్చిరి. కాని, ఎట్టి
కష్టములును, ఎన్ని విఘ్నములునుకూడ పరిశోధకవర్గమువారి
దృఢనిశ్చయమును సడలింపజాలకపోయెను. మే నెల 30 వ తేదీ
నాటికి వారు మరల మూడవ స్థావరమును చేరుటయేకాక
మరి మూడుదినములలో 25,300 అడుగుల యెత్తున అయి
దవ స్థావరము నేర్పాటు కావించుకొనిరి. అచ్చటనుండి
కల్నల్ నార్టన్, సోమర్ వెల్ అనువారిరువురును హిమా
లయ శిఖరమును చేరుటకై బయలుదేరిరి. గాలి తీవ్రముగ
వీచుచుండెను. కాని, వాతావరణ మనుకూలముగనే

యుండెను. పరిశోధకు లిరువురును, ముప్పురు కూలీలను మాత్రము వెంటబెట్టుకొని కొండ నెక్కసాగిరి. రెండు సంవత్సరములకు పూర్వము మెలోరీ ప్రభృతు లనుసరించిన మార్గమునే గుర్తుబెట్టుకొని వారు తమ ప్రయాణము సాగించి పండ్రెండు గంటలకు 27,235 అడుగుల యెత్తునకు చేరిరి. కూలీలు మిక్కిలి అలసిపోయినందున అచ్చటనే యొక స్థావరము నేర్పాటు కావించుటకై పరిశోధకులు నిశ్చయించిరి. కాని, ఇంతటి ఎత్తుప్రదేశములపై డేరాలను వేయుట సులభసాధ్యముకాదు. గాలి తాకిడి విశేషములేని సురక్షిత ప్రదేశములోమాత్రమే డేరాలు నెలకొల్పవలెను. కూర్చుండుటకును, పరుండుటకును అనువైన సమప్రదేశముపై మాత్రమే స్థావరము నేర్పాటుచేయుట అవసరము. కొన్ని రాళ్ళనేరి తెచ్చి వానితో నొక పీఠమును సిద్ధపరచి అచ్చట పరిశోధకులు తమ పటకుటీరమును నిలువబెట్టిరి. వారికి రాత్రియంతయు అచ్చటనే గడచిపోయెను.

ఆ మరునాడు తెల్లవారుసరికాకాశము నిర్మలముగనుండెను. కానిచలిభరింప శక్యముకాకుండెను. అయినను ప్రాతఃకాలభోజనము ముగించుకొని నార్టన్, సోమర్‌వెల్‌లు ముందునకు పోసాగిరి. అడుగడుగునకును వారికాయాసము కలుగజొచ్చెను. మరికొంతసేపటికి సోమర్‌వెల్‌కు గొంతు చెడిపోయి దగ్గుప్రారంభించెను. నార్టన్‌కు దృష్టిదోషము సంభవించెను. ఒకటి రెండు గంటలింకను ప్రయాణము చేయుసరికి సోమర్‌వెల్ పూర్తిగ అలసిపోయి, కాలుతీసి కాలు పెట్టలేని స్థితికి వచ్చినందున ఆతని నొంటరిగ దిగవిడచి, కల్నల్

నార్టనొక్కడే శిఖరమున కెగ్రబ్రాకసాగెను. కొన్ని సందర్భ ములలో ఒకఅడుగు వెడల్పుగల సన్నని త్రోవయందాతడు పోవలసివచ్చెను. ఇరువైపులను అగాధమైనలోయలు. భూమి యంతయు మెత్తని మంచుతోనిండి అడుగుతీసి అడుగు వేయు టకు వీలుకాకుండనుండెను. కాని నార్టన్ జంకకుండ ముందు నకు సాగిపోయెను. తుదకాతడు 28,126 అడుగుల యెత్తును చేరెను. హిమాలయశిఖరము స్పష్టముగ కానవచ్చుచుండెను. కాని ఆతడు సంపూర్ణముగ డస్సియుండెను. ఇంకను ఎనిమిది నూర్ల అడుగులపైకిపోయి చీకటి పడులోపల వెనుకకు తిరిగి వచ్చుటకు సమయముచాలదని నిశ్చయించి నార్టన్ వెనుకకు మరలివచ్చెను. త్రోవలో నాతడు సోమర్‌వెల్‌ను కలిసి కొనగా వారిరువురును అతికష్టముపై నాల్గవస్థావరమునుచేర గల్గిరి. వారిమిత్రులైన మెలోరీ ప్రభృతులు వారికిసరియైన భోజన సదుపాయములు మున్నగువాని నేర్పాటుకావించి తెప్పిరిల్లునట్లు చేసిరి. కాని మంచుపై ప్రకాశించు సూర్య కిరణముల అసామాన్య తేజమువలన నార్టనుకు కండ్లు మిరు మిట్లుగొల్పి తాత్కాలికమగు నంధత్వము సంప్రాప్తించెను. చాలదినములవరకును ఆతడుచక్కగ కండ్లువిప్పి చూడజాలని స్థితియందుండెను.

అప్పటికింకను వర్షఋతువు ప్రారంభము కాలేదు. వాతావరణముకూడ విరుద్ధముగ లేదు. ఈ కారణములచే పర్వత శిఖరమును చేరుటకై మరియొకసారి, యత్నింపవలె నని పరిశోధకులు నిశ్చయించిరి. జూన్ ఆరవ తేదీని మెలోరీ, ఇర్వినులు నలుగురు కూలీలను వెంటబెట్టుకొని బయలుదేరిరి.

ప్రాణవాయువుతో నింపిన గొట్టములనుకూడ వీరు తమకడ నుంచుకొనిరి. ఎత్తైనప్రదేశములకు పోవువారును, ఆకాశ మార్గమున నడచు విమానసారథులు (Pilots) ను ప్రాణవాయువును కృత్రిమ సాధనములద్వారా పీల్చుచుండుట ఆవశ్యకము. కాని, ఈవాయువు పీల్చుటవలన చలిగాలిచే చెడియున్న వారి కంఠనాళములు మరింత చెడి చాల బాధకల్గించును. మెలోరీ పర్వతారోహణమునం దారి తేరినదిట్ట. ఆతనికీవిషయమునందు అపారమైన అనుభవముగలదు. ఇర్విన్ అల్పవయస్కుడైనను మిక్కిలి ఉత్సాహవంతుడు. కావున సి తుదిప్రయత్నమును కావించుటకై వీరినిమించినవారా పరిశోధకవర్గములో లేరని తెలుపవచ్చును.

వారు క్రమక్రమముగా ముందునకు సాగిపోయి ఆరవ స్థావరమును చేరిరి. ఇది సుమారు ఇరువది ఆరు వేల అడుగుల యెత్తున నెలకొల్పబడియుండెను. ఆరాత్రిని వారచ్చటగడిపి ఉదయముననే బయలుదేరిరి. పరిశోధకవర్గములోని ఓడెల్ అనునాతడు మాత్రము వారిని తుదిపర్యాయము చూచెను. అప్పటికేవారు పర్వతముపై చాలదూరము పోయియుండి నందున నాతనికి వారు రెండు చుక్కలవలె కాన్పింపసాగిరి. వారొండొరుల త్రాటితో కట్టుకొని తమ ఆరోహణము నుపక్రమించిరో లేక వేర్వేరుగనే నడచిపోయిరోకూడ ఎవ్వరికిని తెలియదు. మెలోరీయును, ఆతని మిత్రుడును నడచిపోవుచున్న ప్రదేశము ప్రయాణమున కనుకూలముగనే ఉన్నట్లు కాన్పించెను. ఇంతలో వారినొక మంచుతెర కప్పివేసినందున ఓడెల్ తన మిత్రులను చూడజాలకపోయెను.

ఆరవస్థావరముగ నేర్పాటు కావింపబడిన డేరా మిక్కిలి చిన్నది. అందిరువ్పురుమాత్రము కష్టముపై నివసింపగల్గుదురు. కావున మెలోరీ, ఇర్వినులు తిరిగి వచ్చువరకును తానచ్చట వేచియుండుటవలన వారికి కష్టముకల్గునని తెలిసికొని, డేరాను భద్రముగ మూసివైచి ఓడెల్ నాల్గవస్థావరమునకు తిరిగి వచ్చెను. ఆ మరునాడు ఓడెల్‌ను, అతని మిత్రుడగు మరి యొక ఆంగ్లేయుడును తమదుర్భిణీయంత్రముతో నలుదిక్కుల పారజూచిరి. కాని యెచ్చటను మనుష్యసంచారము లేదు. కావున ఇద్దరుకూలీలను సహాయముగ తీసికొని ఓడెల్ అయిదవ స్థావరమునుచేరుటకై బయలుదేరెను. ఆ రాత్రి చలిబాధ మిక్కిలి దుర్భరముగనుండెను. వాయువు ప్రచండవేగముతో నిర్మానుష్యమగు నాపర్వతముపై విహరింపసాగెను. రాత్రి యంతయు ఓడెల్ చలిచే బాధపడుచు గడపెను. కూలీ లిరువురును మిక్కిలి అలసిపోయి లేచుటకుకూడ నశక్తులై యుండిరి. కావున వారినాస్థావరమునందు దిగవిడచి ఆత డొంటరిగ ఆరవస్థావరమునకు బయలుదేరెను. వాయువేగము కాని, శీతలబాధకాని యించుకంతయును తగ్గలేదు. అందు వలన ఆరవస్థావరము చేరుసరికి ఓడెల్‌కు కృత్యాద్యవస్థ ఆయెను.

కాని, ఆరవ స్థావరమునందుకూడ మెలోరీ, ఇర్వినుల జాడ యించుకయును తెలియలేదు. తా నచ్చటనుండి వెడలి వచ్చినతరువాత యెవ్వరును డేరాను తెరువలేదు. కావున మిత్రులగతి యేమైనదో తెలిసికొనవలయునను ఆవేదనతో ఓడెల్ భయంకరమైన యా చలిగాలిలో కొంతదూరము

పైకెగబ్రాకెను. కొంతదూరము పోవుసరికి పరిస్థితు లింకను చెడిపోవుచున్నందువలన, అసహాయుడనగు తానేమియు చేయ జాలనని గుర్తించి యాతడు వెనుకకు మరలివచ్చి నాల్గవ స్థావరమందలి తన మిత్రులకు నిరుత్సాహకరమైన యీ సమాచారమును గుర్తులద్వారా తెలియబరచెను. ఇట్టి పరిస్థితిలో మెలోరీ, ఇర్విను లు సజీవులై యుండగల్గుట అసంభవము.

మెలోరీ, ఇర్వినుల గతి యేమయ్యేనో ఎవ్వరికిని తెలియు లేదు. ముందునూడ తెలియబోదు. కావున వా రదృశ్యులగుటకు కారణములగూర్చి యూహలుమాత్రము కావింప నచ్చును. శిఖరమును చేరవలయునను ఉద్వేగముతో ముందు వెనుక లరయకుండ వారు సాగిపోయియుండవచ్చును. కాని, రాత్రియగుటవలన వారికి వెనుకకు తిరిగివచ్చుటకు సావకాశము లభించియుండదు. త్రోవతప్పి మార్గాంతరములేక పర్వతముపై ఆరుబయటనే ఆ రాత్రిని గడపుటకు వారు నిశ్చయించుకొనియుందురు. ఈ పరిస్థితులలో నిద్ర విశేషప్రయత్నము లేకుండగనే మనల నావహించును. కాని, ఆ నిద్ర నుండి మేల్కొనుటమాత్రము సంభవింపదు. మెలోరీ, ఇర్వినుల వెదకుచు ఆరవ స్థావరమునుండి కొంతదూరమువరకును పైకెగబ్రాకిన ఓడెల్ తన మిత్రులు కావించిన తుది ప్రయత్నమును గూర్చి వ్రాయుచు, వారు గౌరీశంకర శిఖరమును తప్పక చేరియుందురని వాదించెను. కాని, యితర పరిశోధకులీ వాదము నంగీకరింపలేదు. మెలోరీ, యిర్వినులకు పూర్వము కల్నల్ నార్టన్ 28,100 అడుగుల యెత్తునకుపోయియుండెను. బహుశః ఆపైన మార్గమింకను కష్టతరముగనుండుట సంభ

వము. అపాయకరమైన యీ దారులలో నడచునప్పుడు ప్రమాదవశమున కాలుజారి వారిరువురును ఏదైన అగాధమైన లోయలోపడి మరణించియుండవచ్చును.

రెండుపర్యాయములు హిమాలయ శిఖరమును చేరుటకై కావింపబడిన యత్నములు విఫలమైనను, ఆ యత్నములలో కొందరు మిక్కిలి సమర్థులగువారు మరణించినను, ఇతరపరిశోధకులు మాత్రమీ ప్రయత్నమును విరమింపలేదు. 1933 వ సంవత్సరమున హ్యూ రట్లెడ్జ్ (Hugh Ruttledge) అను పరిశోధక ప్రముఖుని యాజమాన్యమున కొందరుధీరులు ఎవరెస్టు శిఖరమును సాధించుటకై యత్నించిరి. ఆసంవత్సరము మంచు విపరీతముగ కురిసినందున పరిశోధకుల యుద్యమమే ఆలస్యముగ ప్రారంభమయ్యెను. ఆపైనకూడ వాతావరణస్థితి బాగుపడలేదు. పర్వతమంతయు మంచుతో కప్పబడిపోయెను. తుపానుగాలులు చెలరేగెను. కావున నీ మూడవ పరిశోధకవర్గమువారుకూడ తమ ప్రయత్నమునందు కృతకృత్యులు కాజాలక వెనుకకు మరలివచ్చిరి. కాని అదే సంవత్సరమున కొందరు వైమానికులు ఎవరెస్టు శిఖరము వరకును విమానములలో ఎగురగల్గిరి. ఈ యత్నమునకు ఫెలోస్ (Fellowes) అను వైమానికోద్యోగి యాజమాన్యమును వహించి జయప్రదముగ నడపించెను. విమానములు గౌరీశంకర శిఖరముపైనుండి రెండుపర్యాయము లెగిరివచ్చెను. ఈప్రయత్నమునందు ఎవరెస్టు శిఖరపు దృశ్యములకు ఛాయాపటములుకూడ తీసికొనబడెను.

పాశ్చాత్యులు కావించిన యీగొప్ప ప్రయత్నములను

విజయవంతముగ ముగించుట నేడు స్వతంత్రత ననుభవించు చున్న భారతీయుల బాధ్యతయై యున్నది.

---

## ప్రశ్నలు

1. గౌరీశంకర శిఖరమును చేరుటకుగల యవరోధము లెట్టివి? వానిని పరిశోధకు లేవిధముగ నెదుర్కొందురు?
2. ధ్రువప్రాంతములకు పోవుటయందును, పర్వతశిఖరముల నెక్కుట యందును గల కష్టములలో భేద, సామ్యముల చూపుము. ఇందేది కష్టతరము?
3. గౌరీశంకర శిఖరమును చేరుటకై పరిశోధకులు కావించిన వివిధ యత్నముల క్లుప్తముగా వర్ణింపుము.
4. ఈ పరిశోధన విషయమై 1932 తరువాత జరిగిన ప్రయత్నములను పేర్కొనుము.
5. పర్వత శిఖరముల నెక్కుటవంటి సాహసకార్యములకు పూనుకొను వారి జీవితలక్ష్యము లెట్టివో యూహింపుము.